పార్లే

ఇప్పుడు పార్లే పాపిన్స్ మజా సాగేను ఆగకుండా అలా...
ఇక ప్యాకెట్ యింతలో అయిపోతే మాత్రం ఏం యిలా



పార్లే పాపిన్స్ ర్యాపర్లు పంపించండి, ఉర్రూతలూగించే కానుకలు పొందండి.

ఉచితం : పార్లే పాపిన్స్ 20 ర్యాపర్లు పంపినప్పుడు పరిహాసం చిలికే పజిల్ కిట్. పార్లే పాపిన్స్ 10 ర్యాపర్లు పంపినప్పుడు ఫన్ ప్యాడ్ మరియు జంగిల్ బుక్ స్టికర్. పార్లే పాపిన్స్ 4 ర్యాపర్లు పంపినప్పుడు జంగిల్ బుక్ స్టికర్.



*పార్లే పాపిన్స్ యీ కానుక లేకుండా కూడా దొరుకుతాయి.




ఇప్పుడు పార్లే యొక్క కొత్త, పళ్ళ రుచులలో.

ఫ్రూట్ జ్యామ్ లేదా పల్ప్ రహితంగా, అదనపు ఫ్లేవర్స్ సహితంగా.

త్వరపడండి మరి,
ఉన్న కానుకలు మహా తక్కువ.

పోస్టల్ స్టాంపులున్న కవరుపై మీ పేరూ, అడ్రసూ వ్రాసి, దాంతోబాటు పార్లే పాపిన్స్ ర్యాపర్లతో బాటు యీ అడ్రసుకు పంపించండి : పాపిన్స్ పాయింట్, పి.ఓ. బాక్స్-907, బొంబాయి-400 057.

everest/94/PP/186-tl

# కాల్షియమ్ పిల్ల టీనా యొక్క సాహసాలు. ''వాస్తవమైన సామర్థ్యం''







































అమోఘమైన ఉచిత బహుమతులందుకోండి!!

మిత్రులారా, 200 గ్రా.ల పార్లే ప్రూడెంట్ కాల్షియమ్'' ప్యాక్ యొక్క ఫ్లాప్‌ను (పళ్ళు) డ్రాయింగ్‌గల ప్రక్క) మీ పేరు, మీ జన్మదినం, మీరు చదువుకొనే స్కూలు మరియు క్లాసు వివరాలకు జతపర్చి, ఈ అడ్రసుకు వెంటనే పంపండి: పార్లే ప్రొడక్ట్స్ లి., నిర్లాన్ హౌస్, వర్లి, బొంబాయి 400 025.

IB&W/94/223

# BAND-AID®

## Funtest

ప్రతి బ్యాండ్-ఎయిడ్ ఫన్‌టెస్ట్ ప్యాక్‌తో రెండు ఫన్‌స్టిక్స్* ఉచితం




## మీ ఫన్‌స్టిక్స్* ని పోగుచేయడం మొదలెట్టండి ఇప్పుడే!

*నూనాననగల ప్లాస్టిక్ రేయాన్స్

నియమాలు, నిబంధనలు

1. ఈ పోటీలో 4 నుంచి 15 సంవత్సరాల మధ్య వయసులోని పిల్లలు పాల్గొనేందుకు అర్హత వుంది. కేవలం భారతీయ పౌరులే దీన్లో పాల్గొనే అర్హత వుంది.
2. జాన్సన్ అండ్ జాన్సన్ మరియు ఒగిల్వీ మేథర్ సంస్థలలో పనిచేసే ఉద్యోగులూ, వారి బంధువులూ వీరికి పాల్గొనే అర్హతలేదని సాదరమైన సూచన.
3. ఒక వ్యక్తి ఎన్ని ఎంట్రీలైనా పంపవచ్చును.
4. ప్రతి ఎంట్రీ పూర్తిగా వుండాలి. అసంపూర్తి అయినవీ, లేదా అర్హతలేని ఎంట్రీలూ రద్దుచేయబడ్డవాటిగా పరిగణిస్తాం.
5. ఎంట్రీలు పంపవలసిన ఆఖరు తేదీ, 28 ఫిబ్రవరి, 1995. అయితే యీ ఆఖరి గడువు తేదీని పొడిగించే లేదా వెనక్కి మార్చే హక్కు కంపెనీ వారికి చెందుతుంది.

# బ్యాండ్-ఎయిడ్®

# ఫన్‌టెస్ట్‌లో పాల్గొనండి

జాన్సన్ అండ్ జాన్సన్

మీరు చేయవలసిందల్లా ఒక స్ట్రిప్ పెయింట్ చెయ్యడం, సరళమైన కొన్ని ప్రశ్నలకి జవాబులివ్వడం, అంతే. ఇక బోలెడన్ని సరదా అయిన బహుమతులుమీవే, గెలుచుకునేది మీరే.

*దాంతోబాటే ముందుగా ఎంట్రీలు పంపేవారికి*

**1000** బహుమతులు *(మరందుకే మీ ఎంట్రీని పంపండి నేడే!)*













ఫన్‌స్ట్రిప్ తయారుచేయండి!

మీ ఆలోచనతో యీ బ్యాండ్-ఎయిడ్ ని ఫన్‌స్ట్రిప్‌గా రూపొందించండి. మీరు రంగు వాడవచ్చు, చిత్రం గియ్యవచ్చు లేదా దానిపై వ్రాయవచ్చును, అది చక్కని ఫన్‌స్ట్రిప్ అయ్యేలా.

సరియైన జవాబుకి ✓ మార్క్ పెట్టండి

1. బ్యాండ్-ఎయిడ్ స్ట్రిప్ సైజు ఏమిటి?
   ☐ 19 మి.మి. X 72 మి.మి. ☐ 17 మి.మి. X 70 మి.మి. ☐ 21 మి.మి. X 74 మి.మి.
2. కేవలం జాన్సన్ అండ్ జాన్సన్ వారి బ్యాండ్-ఎయిడ్ స్ట్రిప్స్ మాత్రమే పూర్తిగా స్టెరిలైజ్ చెయ్యబడినవి.
   ☐ నిజం ☐ అబద్ధం
3. ది బ్యాండ్-ఎయిడ్ ఫన్‌టెస్ట్ ప్యాక్‌లో ఎన్ని బ్యాండ్-ఎయిడ్ స్ట్రిప్స్ (అన్ని రకాలూను) వున్నాయి?
   ☐ 20 ☐ 15 ☐ 30
4. బ్యాండ్-ఎయిడ్ ప్యాడ్ పైనగల ప్రభావంగాపనిచేసే మందు ఏమిటి?
   ☐ బోరిక్ పౌడర్ ☐ బెంజల్‌కోనియమ్ క్లోరైడ్ ☐ టించర్ అయోడిన్
5. భారతదేశంలో, బ్యాండ్-ఎయిడ్ స్ట్రిప్స్ పైన ఎన్ని వాల్ట్ డిస్నీ పాత్రలు కనిపించాయి?
   ☐ 4 ☐ 6 ☐ -2

పేరు : ______________________

పుట్టిన తేదీ : ____________ ఆడా/మొగా : ____________

అడ్రసు : ______________________

స్కూలు పేరు : ______________________

6. ఏ ఎంట్రీ తిరిగి పంపబడదు.
7. విజేతలకి పోస్టులో సమాచారం అందించబడుతుంది.
8. న్యాయనిర్ణేతల నిర్ణయమే తుదినిర్ణయం.
9. ఈ స్కీమ్‌ని ఏ కారణమూ సూచిస్తూనో/సూచించకుండానో, మార్చడానికీ లేదా ఉపసంహరించుకోడానికి గల ఆ హక్కు జాన్సన్ అండ్ జాన్సన్ వారికి చెందుతుంది.
10. ఎంట్రీ ఫారమ్‌లు అన్నీ సాధారణమైన పోస్టులో వీరికి పంపాలి : ది బ్యాండ్-ఎయిడ్ ఫన్‌టెస్ట్, C/o. డేటాబేసిక్స్, పి.బి. బాక్స్-16605, బొంబాయి-400 019.



# చందమామ

ఫిబ్రవరి 1995



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు





విడి ప్రతి : **5.00**

సంవత్సర చందా : **60.00**




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## పిల్లలూ, టీవీలూ



పిల్లలలో చదువుపట్ల ఆసక్తి తగ్గడానికీ, వాళ్ళు పరీక్షలు సరిగ్గా రాయలేకపోవడానికీ ఇటీవల ఉధృతమైపోతున్న టీవీ కార్యక్రమాలే కారణం అని చెబుతున్నారు. బడి నుంచి ఇంటికి రాగానే పిల్లలకు హోంవర్క్ కన్నా టీవీ కార్యక్రమాలే ప్రధానమై కూర్చుంటున్నాయి. దాంతో చదవడానికి సమయం లేకుండా పోతున్నది.

టీవీలు ఎక్కువగా చూసే పిల్లలలో చదువు దెబ్బతినడం మాత్రమే కాదు: మిగతా పిల్లలతో కలిసి మెలిసి తిరుగుతూ ఆడుకునే ఆసక్తి కూడా సన్నగిల్లుతున్నది. ఇది ఆరోగ్యకరమైన పరిణామం కాదు.

కాబట్టి పిల్లలు ఎంతసేపు టీవీ చూడాలి? ఏ ఏ కార్యక్రమాలు చూడాలి? వేటిని చూడకూడదు? మొదలైన విషయాలను నిర్ణయించవలసిన బాధ్యత తల్లిదండ్రుల మీద ఉన్నది.

ఇటీవల ఢిల్లీలో దాదాపు రెండు వందల కుటుంబాలలో జరిపిన సర్వేలో -- 58 శాతం కుటుంబాలలో తల్లిదండ్రులు పిల్లలతో కలిసి టీవీలు చూస్తారనీ, 42 శాతం కుటుంబాలలో పిల్లలు మాత్రమే చూస్తారనీ తెలియవచ్చింది.



విజ్ఞానశాస్త్రం ప్రసాదించిన గొప్ప వరం టీవీ. దీనిని సక్రమంగా ఉపయోగించుకోవాలి. పిల్లల మానసిక వికాసానికీ, శారీరక అభివృద్ధికీ దోహదం చేసే కార్యక్రమాలను రూపొందించాలి. ఇటువంటి పిల్లల కార్యక్రమాలతో ప్రత్యేకమైన ఛానల్స్ ప్రవేశపెట్టాలి. ఈనూతనప్రయోగం కొన్ని దేశాలలో విజయవంతమై మంచి ఫలితాలనిచ్చింది.

సంపుటి : 97 ఫిబ్రవరి '95 సంచిక: 2

విడిప్రతి : 5.00 సంవత్సర చందా : 60.00



# ముగిసిన వెయ్యిరోజుల యుద్ధం!

నూతన సంవత్సరారంభాన్ని సూచిస్తూ, చర్చ్ గంటలు మోగడానికి బదులు బోస్నియా-హెర్జ్‌గోవినాలో తుపాకీ పేలుళ్ళు వినిపించాయి. కొన్నేళ్ళుగా మామూలే కాబట్టి అక్కడి ప్రజలకు ఇది వింతగాఅనిపించలేదు. అయితే, ఆ తరవాత తుపాకీ పేలుళ్ళ శబ్దం ఆగిపోవడం గ్రహించి ప్రజలు ఆనందించారు. యుగొస్లేవియా ఫెడరేషన్ నుంచి స్లొవేనియా, క్రోషియా, మేసిడోనియాతోపాటుబోస్నియా-హెర్జ్‌గోవినావిడిపోవడంతో మూడేళ్ళకు ముందు యుద్ధం ప్రారంభమయింది. ప్రస్తుతం సెర్బియా, మాంటినీగ్రోలు మాత్రమే యుగొస్లేవియా ఫెడరేషన్‌లో ఉన్నాయి.

మేసిడోనియాలో తప్ప మిగతా మూడు రిపబ్లిక్‌లలోనూ హింసాత్మక ఘర్షణలు కొనసాగుతూనే ఉన్నాయి. యుగొస్లేవియా ఫెడరేషన్ సైన్యంలో సెర్బ్‌లు అధిక సంఖ్యలో ఉన్నారు. ముఖ్యంగా బోస్నియా-హెర్జ్‌గోవినాలో తీవ్ర స్థాయిలో 33 నెలలు యుద్ధం కొనసాగింది. రెండవ ప్రపంచ యుద్ధానంతరంఅంటే 1945 తరవాత యూరపులో సుదీర్ఘకాలం కొనసాగిన యుద్ధం ఇదే!

అధిక సంఖ్యాకులయిన ముస్లింలతోనూ, అల్ప సంఖ్యాకులయిన క్రోషియన్లతోనూ సెర్బ్‌లు ఘర్షణ పడుతున్నారు. రాజధాని సరాజీవోలోని వైమానిక కేంద్రాన్ని సెర్బ్‌లు పట్టుకున్న తరవాత ఐక్యరాజ్య సమితి శాంతి పరిరక్షక దళాలు తమ కర్తవ్యాన్ని నిర్వహించలేకపోయాయి. ఘర్షణలు ఉధృతమైన నగరాలకు నిత్యావసర వస్తువుల సరఫరా కూడా అసాధ్యమైపోయింది.

అమెరికా, రష్యా, ఫ్రాన్స్, జర్మనీ, బ్రిటన్ ఈ ఐదు దేశాలు సంయుక్తంగా ఏర్పాటు చేసిన కమిటీ పలు శాంతి పథకాలను ప్రతిపాదించింది. అయితే, పోరాట పక్షాలు వాటిని మొదట తిరస్కరించాయి. ఆఖరికి, 49 శాతం ప్రాంతాన్ని సెర్బ్‌లకూ మిగతా ప్రాంతాన్ని మిగిలిన వారికీ కేటాయించాలన్న ఐదు దేశాల ప్రతిపాదనను ముస్లిం ప్రభుత్వం అంగీకరించింది. దానిని క్రోట్ ప్రజలు కూడా ఆమోదించారు.

అదే సమయంలో, ఐక్యరాజ్యసమితి శాంతి పరిరక్షక దళాలుగా వెళ్ళిన అమెరికా సేనలపై, సెర్బ్‌లు దెబ్బతీయడంతో, అమెరికా బోస్నియాకు ఆయుధాలు సరఫరా చేయగలమని బెదిరించింది. దాంతో సెర్బ్‌లు మాజీ అమెరికా అధ్యక్షుడు జిమ్మీ కార్టర్ సహాయాన్ని అర్థించారు. జిమ్మీ కార్టర్ అంతకు పూర్వమే అమెరికా-ఉత్తర కొరియా ఘర్షణ, హైటీ అంతర్యుద్ధం ఆపడానికి కృషి చేసి శాంతి మంతనాలు జరపడంలో నేర్పరిగా పేరుగాంచాడు.

కార్టర్ ముస్లిం నాయకులతోనూ, సెర్బ్ నాయకులతోనూ చర్చలు జరిపి — ఐదు దేశాల శాంతి పథకాన్ని అంగీకరించమని సెర్బ్‌లను కోరాడు. ఒక వారం తరవాత, అంటే డిసెంబర్ 31వ తేదీ ఉభయ పోరాట పక్షాలూ 4 నెలల వరకు ఘర్షణలు ఆపి , తుది పరిష్కారాన్ని మే నెలలోగా పొందడానికి వీలుగా చర్చలు జరపాలని అంగీకరించాయి. ఆ విధంగా దాదాపు వెయ్యి రోజుల పాటు సాగిన ఘర్షణల అనంతరం బోస్నియాలో శాంతి నెలకొనడానికి తగిన పరిస్థితులు ఏర్పడ్డాయి.





# ఎవరి సాహసం వారిది!

బీరన్న అనే వాడికి తన గ్రామంలోనే వున్న గౌరి అంటే ఇష్టం. పెళ్ళి చేసుకుందామను కున్నాడు. గౌరి వజ్రాల హారం తెచ్చి పెట్టమన్నది. అందుకు వెయ్యి వరహాలవుతుంది. అంత పెద్ద మొత్తం బీరన్న వద్దలేదు.

బీరన్నకు బాగా డబ్బు సంపాయించే పను లేవీ చేతకావు. అందుకని వంట నేర్చుకు న్నాడు. అందరిళ్ళకూ వెళ్ళి కూరలు తరగడం, పప్పు రుబ్బడం లాంటి పనులు చేస్తూంటాడు. వంటలు కూడా చేస్తూంటాడు. అలా వచ్చిన డబ్బుతో రోజులు గడిచిపోతాయి తప్ప,వెయ్యి వరహాలు పోగుచేయడం వాడికి సాధ్యం కాదు. కానీ వాడికి గౌరిని పెళ్ళి చేసుకోవాలనుంది.

ఇలా వుండగా — ఆదేశపు రాజొక ప్రకటన చేశాడు. గొప్ప సాహసకార్యం చేసిన వాడికి పదివేల వరహాలిస్తాడట రాజు.

బీరన్నకు సాహసకార్యం చేయాలనుంది. కానీ వాడికి కప్ప కలలో కనబడితేనే భయం. అందుకే వాడు వ్యవసాయం కూడా చేయడం లేదు. అలాంటి వాడు సాహసకార్యలెలా చేస్తాడు? ఆ గ్రామంలో వున్న రామయ్యతాతకు చాలా ఉపాయాలు తెలుసు. బీరన్న రామయ్య తాతను సాహసకార్యాలు చేయగల ఉపాయం చెప్పమన్నాడు.

తాత బీరన్నను బాగా ఎరుగు. ఆయన వాడితో, "భయం మనిషికి జబ్బు లాంటిది! ధైర్యముంటే ఫరవాలేదు, లేనివాడు మందులు పుచ్చుకుని భయాన్ని తగ్గించుకోవాలి. భయం లేనివాడు సాహసకార్యాలు సులభంగా చేయ గలడు. నువ్వు చంద్రపురం వెళ్ళు. అక్కడ కొండ గుహలో ఒక బైరాగి వుంటున్నాడు. ఆయన వద్ద భయాన్ని తగ్గించే మూలికలు న్నాయి," అని చెప్పాడు.

వెంటనే బీరన్న గౌరిని కలుసుకుని, "నీ కోసం నేను చంద్రపురం వెళుతున్నాను. అక్కడ నా భయాన్ని తగ్గించుకుని రాజధానికి

రాయవరపు ఆదినారాయణరావు

వెళ్ళి సాహసకార్యం చేసి డబ్బు సంపాదించి, దానితో నీకు వజ్రాల హారం కొని తెస్తాను," అంటూ రామయ్యతాతచెప్పిందంతా చెప్పాడు.

గౌరి నవ్వి, "నువ్వింకా చంద్రపురం వెళ తానంటున్నావు. నారన్న అప్పుడే రాజధానికి నేరుగా బయల్దేరి వెళ్ళిపోయాడు. వాడు నీకంటే ముందుగా వజ్రాలహారం తెస్తే, నేను వాడినే పెళ్ళి చేసుకుంటాను," అన్నది.

నారన్నకు కూడా గౌరి అంటే ఇష్టం.వాడు బీరన్న అంత అందగాడు కాకపోయినా మహా సాహసి.వట్టి చేతులతో తాచుపామును పట్టు కుంటాడు. అర్ధరాత్రి పూట దయ్యాల మర్రి కింద పడుకుంటాడు. వాడితో తను పోటీ పడగలడా? ఇలా ఆలోచించి, చివరకు బీరన్న మనసు రాయిచేసుకుని చంద్రపురం వెళ్ళాడు. బైరాగిని కలుసుకున్నాడు. ఆయన బీరన్న కథ విని, "ఆ మూలిక ఈ పక్క గుహలో వుంది. వెళ్ళి తెచ్చుకో," అన్నాడు.

బీరన్న గుహలోకి తొంగి చూడగానే కప్పలు బెకబెక మన్నాయి. వాడు కంగారుపడి బైరా గితో, "స్వామీ! గుహనిండా కప్పలున్నట్టు న్నాయి. ఎలా వెళ్ళేది?" అన్నాడు.

"పాములైతే ప్రాణాలు తీస్తాయి కానీ కప్పలేం చేస్తాయి, నాయనా! వెళ్ళి మూలికను తెచ్చుకో. అక్కడ కప్పలు తప్ప మరే జంతు వులూ లేవు," అన్నాడు బైరాగి.

"స్వామీ! నామీద దయవుంచి ఆ మూలి కను తమరే తెచ్చివ్వండి. మీ మేలు ఈ



జన్మకు మరిచిపోలేను," అని బీరన్న వేడుకు న్నాడు.

"నువ్వు స్వయంగా తెచ్చుకుంటేనే మూలిక నీకు పని చేస్తుంది!" అని బైరాగి, బీరన్నకు ఖచ్చితంగా చెప్పేశాడు.

"అయితే, నా అదృష్టం ఇంతే!" అని బీరన్న తిరుగు ప్రయాణమయ్యాడు.

దారిలో బీరన్నకొక గుర్రపు బండి ఎదుర యింది. అందులో పరగణాకంతకూ వస్తాదు పైడిరాజు కూతురు రాగమతి ప్రయాణం చేస్తూ, వాడిని చూసి బండి ఆపించింది. ఆమెది తిక్కబుద్ధి, పైగా ఎక్కడలేని పొగరు. అందు వల్లనే ఆమెకు ఇరవై ఏళ్ళు నిండినా పెళ్ళి చెయ్యలేక పైడిరాజు నానా అవస్థపడుతున్నాడు.



బీరన్న బండిని సమీపించగానే రాగమతి, "ఆహా, ఏమందం! నేను వస్తాదు పైడిరాజు కూతుర్ని. నిన్ను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను," అన్నది.

"నేను గౌరిని ప్రేమించాను. ఆమెను తప్ప ఇంకెవర్నీ పెళ్ళిచేసుకోను,"అని నొక్కి చెప్పాడు బీరన్న.

రాగమతి, గౌరి గురించి వాడిని వివరాలడిగి తెలుసుకుని, "నువ్వు వెర్రివాడిలా వున్నావు! ఆ గౌరి పూటకు గతిలేనిది. నేను వస్తాదు కూతుర్ని. నన్ను కాదని దాన్ని చేసుకుంటావా?" అన్నది కోపంగా.

అవునన్నట్టు తలాడించాడు బీరన్న. అంతలో బండిలోంచి బొద్దింక ఒకటి వాడి మీదికి దూకింది. బీరన్న హడలిపోయి కెవ్వుమని అరిచాడు. వాడు మహాపిరికి అని అర్థం చేసుకున్న రాగమతి, "నన్ను పెళ్ళిచేసుకోనంటే నిన్ను బొద్దింకలున్న గదిలో బంధిస్తాను," అని బెదిరించింది.

ఆమాట వింటూనే బీరన్న అక్కడి నుంచి పరుగు పుచ్చుకున్నాడు. రాగమతి వాణ్ణి బండితో తరిమింది. ఆ సమయానికి అటుగా వస్తున్న నారన్న బండిని అటకాయించి, ఏమిటీ అన్యాయం అని అడిగాడు. రాగమతి వాడికి జరిగింది చెప్పింది.

"కప్పలకూ, బొద్దింకలకూ భయపడేవాడిని, ఈ చుట్టుపక్కల ఐదారు పరగణాల్లో పేరు మోసిన వస్తాదు పైడిరాజు కూతురు పెళ్ళాడవచ్చా? ఇలాంటి వాడు వస్తాదు అల్లుడైతే జనం నవ్వుకోరా?" అన్నాడు నారన్న.

"ఆమాటా నిజమే! అయితే, నేను సాహస వీరుణ్ణి పెళ్ళిచేసుకుంటాను. అందం సంగతి తర్వాత," అని రాగమతి బండిని మళ్ళించి తన దారిన వెళ్ళిపోయింది.

ఆయాసంతో రొప్పుతూ నిలబడ్డ బీరన్న, నారన్నకు కృతజ్ఞతలు తెలుపుకుని, "నువ్వప్పుడే రాజధాని నుంచి తిరిగివస్తున్నావా, ఏం సాహసకార్యం చేశావు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు నారన్న జబ్బలు చరుచుకుని, "ఒకేసారి రెండు మొసళ్ళతో నీటిలో వుండి పోరాడి నెగ్గాను. రాజు నాకు పదివేల వరహాలిచ్చాడు. అంత డబ్బూ పెట్టి చాలా అందమైన

వజ్రాల హారం కొన్నాను. గౌరిని పెళ్ళి చేసుకుంటాను," అని వాడింకా ఏదో చెప్పబోతూండగా, వాళ్ళున్న చెట్టుపై నుంచి వాళ్ళ మీద వలలాంటిదొకటి పడింది.

వలలోంచి బయట పడేందుకు బీరన్నా, నారన్నా పెనుగులాడుతూండగా, చెట్టు మీది నుంచి నలుగురు దొంగలు కిందికి దూకి, నారన్న వద్ద వున్న వజ్రాల హారం గుంజుకుని పారిపోయారు.



ఆ తర్వాత కొంతసేపటికి బీరన్న, నారన్న వలలోంచి బైటపడ్డారు. నారన్న, బీరన్నతో, "దొంగలిక్కడ చెట్టుమీద మాటు వేసి వున్నారన్న మాట! నా దగ్గరున్న వజ్రాల హారం సంగతి తెలియగానే మన మీద వలవిసిరారు. నేను వాళ్ళను వదలను. ఇప్పుడే వెళ్ళి వాళ్ళను పట్టుకుని వజ్రాలహారం తెస్తాను. ఈలోగా నువ్వు గ్రామానికి వెళ్ళి గౌరికి నేను వస్తున్న విషయం చెప్పు," అన్నాడు.

నారన్న దొంగలు వెళ్ళిన దిశగా పరిగెత్తితే, బీరన్న తన గ్రామంచేరి జరిగినదంతా గౌరికి చెప్పాడు.

"నలుగురు దొంగల్ని పట్టుకునేందుకు ఒక్కడూ వెళ్ళాడా? వాడి మొండి ధైర్యాన్ని మెచ్చుకోవాలి," అన్నది గౌరి, నారన్నను మెచ్చుకుంటూ.

ఇక ఆమె నారన్ననే పెళ్ళి చేసుకుంటుందని బీరన్న రూఢి చేసుకున్నాడు. కొద్దిసేపట్లో నారన్న వజ్రాలహారం తీసుకుని రావడం ఖాయం! ఇలా అనుకుని వాడు ధైర్యం చేసి, "అసలు పెళ్ళికీ, వజ్రాలహారానికీసంబంధం ఏమిటి? నీకు డబ్బు ముఖ్యమా? ప్రేమ ముఖ్యమా? నేను వజ్రాలహారం తేలేను, కానీ నాకు నువ్వే కావాలి. నన్ను పెళ్ళిచేసుకో!" అన్నాడు.

గౌరి నవ్వి, "నాకూ నువ్వంటే ఇష్టమే! ఈ మాత్రం మాట ముందే అనుంటే, అప్పుడే నేను పెళ్ళికి ఒప్పుకుని వుండేదాన్ని. సరేలే, ఇప్పటికైనా ధైర్యం చేశావు కాబట్టి, నీతోనే నా పెళ్ళి జరుగుతుంది," అన్నది.

బీరన్న సంతోషానికి పట్ట పగ్గాలు లేవు. అంతలో నారన్న అక్కడికి వజ్రాలహారం తీసుకుని వచ్చాడు.

"నువ్వు ఆలస్యం చేశావు. నువ్వు చెయ్యలేని సాహసం చేసిన బీరన్నను నేను పెళ్ళి చేసుకుంటున్నాను," అని గౌరి వాడికి చెప్పింది.

"కప్పలకూ, బొద్దింకలకూ భయపడేవాడు, నేను చేయలేని సాహసమేం చేశాడు?" అని అడిగాడు నారన్న ఆశ్చర్యంగా.

"సాహసమంటే కేవలం కత్తియుద్ధాలూ కావు, మొసళ్ళతో పోరాడటమూ కాదు. మనసులోమాటను ధైర్యంగా చెప్పగలగాలి. బీరన్న ఎంత ధైర్యవంతుడంటే, నాకోసం వస్తాదు కూతుర్ని కూడా కాదన్నాడు. అందువల్ల ఎంత ప్రమాదం? కోపం వచ్చిందంటే, వస్తాదు బాణా కర్రతో బీరన్న ఒళ్ళు హూనం చెయ్యవచ్చు! మనసులోని మాట చెప్పే ధైర్యముంది కనకే, నాతో పెళ్ళి గురించి మాట్లాడాడు: నిజమే! ఇష్టపడి చేసుకునే పెళ్ళికి షరతులెందుకు? హారం కోసం నేను నిన్ను పెళ్ళి చేసుకుంటే, అది వ్యాపారం అనిపించుకోదా?" అన్నది గౌరి.

నారన్న, గౌరి చెప్పిందానికి అంగీకరించి, "నీ మాటల్లో నాకు న్యాయం కనబడుతున్నది. నాకు సాహసకార్యాలు చేయడం అంటే మోజుండి, రాజధానికి వెళ్ళాను. అంతా నా గురించి గొప్పగా చెప్పుకోవాలనే వజ్రాల హారాన్ని అంత ఖరీదు పెట్టికొన్నాను. వస్తాదు కూతురు రాగమతిని చూడగానే ఆమె అందానికి నాకు మతిపోయింది. రాగమతి సాహస వీరుణ్ణి పెళ్ళి చేసుకుంటాననగానే, నాకామెపై ఆశకూడా పుట్టింది. కాని నా ఇష్టాన్ని గురించి ఆమెకు చెప్పే సాహసం చెయ్యలేకపోయాను. నా కవసరమైన చోట ఉపయోగపడని సాహసం నాకెందుకు? ఆ విధంగా బీరన్నే నాకంటే సాహసి!" అన్నాడు.

దానికి బీరన్న ఉత్సాహపడిపోతూ, "నేనూ సాహసినేనని ఒప్పుకున్నావన్న మాట! పద, వస్తాదు పైడిరాజు కూతుర్ని పెళ్ళాడేందుకు నేను నీకు సాయపడతాను, నీ సాహసం నీది, నా సాహసం నాది," అన్నాడు.

ఇది విన్న గౌరి చిరునవ్వు నవ్వి, "అవును, ఎవరి సాహసం వారిది!" అన్నది.

ఆ తర్వాత కొద్ది రోజులకే సాహసవీరుడైన నారన్న - రాగమతికీ; బీరన్న - గౌరిలకూ పెళ్ళిళ్ళు జరిగాయి.





# చేపలవేట

పనిమీద పట్నం వెళుతున్న చంద్రయ్యకు, దారిలో ఒక చెరువు కట్టమీద ఒక వింత దృశ్యం కంటబడింది. అదేమిటంటే – ఇద్దరు వ్యక్తులు చేతిలో చెరొక అద్దమూ పట్టుకుని, సూర్యుడు అద్దాలలో ప్రతిబింబించగా వచ్చిన కాంతిని చెరువు నీటిపై ప్రసరింపచేస్తున్నారు.

సంగతేమిటో తెలుసుకుందామని చెరువు కట్ట ఎక్కిన చంద్రయ్య, ఆ ఇద్దరిలో ఒకడు తమ ఊరివాడే అయిన కిష్టయ్య అని గ్రహించాడు. రెండవవాడు ఆజానుబాహువు. చారల పంచా, గళ్ళ చొక్కాతో పట్నం వాడిలా కనిపిస్తున్నాడు. చంద్రయ్య వాళ్ళిద్దర్నీ సమీపించి, "వింతగా వుందే? ఏమిటి మీరు చేస్తున్నది?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు పట్నంవాడు, "తెలియనివాడికి ప్రతిదీ వింతే, లోకమే ఒకపెద్దవింత! మేము చెరువుకట్టపై వున్నాం. దిగువున చెరువున్నది. చేపలు పడుతున్నాం," అన్నాడు.

ఇదివినిచంద్రయ్యఆశ్చర్యపోతూ, "ఇదేదో మహావింతగా వుందే!వలవేసి చేపలు పట్టగా చూశాను. గాలంతో పట్టగా చూశాను. ఇలా చేపలు పట్టగా ఎన్నడూ చూడలేదు. ఇంతకూ చేపల్ని ఎలా పడతావు?" అని అడిగాడు.

"ఇది చేపలవేట విద్య. ఈ విద్య నేర్చిన వాడు నీళ్ళల్లో దిగి కాళ్ళకూ, చేతులకూ బురద చేసుకోనవసరం లేదు. వలా, గాలాల్లాంటివి మోయనవసరం లేదు," అన్నాడు పట్నంవాడు.

చంద్రయ్య మరింత ఆశ్చర్యపోయాడు. పట్నంవాడు కోపంగా, "మా తాతా తండ్రుల నుంచి నేర్చిన విద్యను, నీకు ఉచితంగా చెప్పడానికి నేనేమన్నా అమాయకుణ్ణనుకున్నావా? ఇతణ్ణి చూడు! ఒడ్డున నిలబడి చేపలు పట్టే రహస్యాన్ని, నా దగ్గరే తెలుసుకుని, నాకే పోటీగా నిలబడ్డాడు. నాకెంత నష్టం! నీకుమరీ అంతగా ఈవిద్య నేర్వాలని వుంటే,

వారణాశి శ్రీరామక్రిష్ణ

నాకు యాభైరూపాయలివ్వు. ఈ రహస్యం నీకు చెప్పేస్తాను," అన్నాడు.

చంద్రయ్య వెంటనే రొంటినుంచి డబ్బులు తీసి-లెక్కపెట్టి, యాభై రూపాయలు పట్నం వాడికిచ్చాడు. వాడు డబ్బు భద్రం చేసుకుని, చంద్రయ్యతో, "ఉన్న కిటుకంతా ఈ అద్దం లోనే వుంది. మాలాగే కదలకుండా నిలబడి సూర్యకిరణాల కాంతిని చెరువు నీటిలో ఒకే చోట పడేలా చేస్తూ వుండు. చేపలు ఎండ దెబ్బకు సొమ్మసిల్లి నీటిపైకి తేలతాయి. తర్వాత వాటిని పట్టి ఒడ్డుకు చేర్చుకోవడమే మనపని!" అన్నాడు.

చంద్రయ్య, "ఇంతవరకూ ఇలా ఎన్ని చేపలు చిక్కాయి?" అని అడిగాడు పట్నం వాణ్ణి అనుమానంగా.

వాడు నవ్వి,"నీతో కలిపి ఆరు!" అన్నాడు.

"మోసం! దగా!" అంటూ చిందులేశాడు చంద్రయ్య.

"ఊరికేఅరిచి ఉపయోగంలేదు. నీలాంటి మరో చేప వచ్చి నాకు చిక్కిందాకా, నాతో పాటు అద్దం పట్టుకుని నిలబడ్డావంటే పాతిక రూపాయలు తిరిగిస్తాను. సరేనా?" అంటూ అప్పటిదాకా తనతోపాటు నిలుచున్న కిష్టయ్య చేతిలో పాతిక రూపాయలు పెట్టాడు.

అరగంట కాలం గడిచింది. అంతలో చెరువు కట్ట అవతలివైపు నుంచి కిష్టయ్య నలుగురు మనుషులతో వస్తున్నాడు. అందరి చేతుల్లో దుడ్డుకర్రలున్నాయి.

వాళ్ళను చూసి పట్నంవాడు ముందు సంతోషించి తర్వాత అనుమానంగా, "నా దగ్గర చేపలవేట నేర్చినవాడు, మరి నలుగుర్ని ఆ విద్య నేర్పుకునేందుకు తీసుకువస్తున్నాడు, బాగానే వుంది! మరి, చేతిలో ఆ దుడ్డు కర్రలేమిటి?" అన్నాడు.

చంద్రయ్య పెద్దగా నవ్వి, "వాళ్ళు, దుడ్డు కర్రల వేట నీకు నేర్పేందుకు వస్తున్నారు. కాళ్ళూ చేతులు విరిగాక,నువ్వు పట్నం ఎలా పోగలవా అని విచారంగా వుంది!" అన్నాడు.

వెంటనే పట్నంవాడు కిష్టయ్య, చంద్రయ్యల నుంచి తీసుకున్న డబ్బుతో పాటు మరికొంత డబ్బును చంద్రయ్య చేతిలోపెట్టి, తిరిగిచూడకుండా పట్నంకేసి పరిగెత్తాడు.






[ట్రోయ్ రాజు కొడుకైన మోహనుడు భువనసుందరిని ఎత్తుకు పోయినందువల్ల గ్రీకులు తమ నావలనూ,బలాలనూ ఆయత్తం చేసుకునిట్రోయ్‌పైకి దండెత్తి వచ్చారు. మొదటిరోజు యుద్ధంలో ట్రోజనులు దెబ్బతిని తమ నగరంలోకి పారిపోయారు. తరవాత గ్రీకులుట్రోయ్‌నగరానికి ముట్టడివేసి పరిసర దేశాలను కొల్లగొట్టసాగారు. ట్రోయ్ ముట్టడి తొమ్మిదిసంవత్సరాలపాటు సాగింది. ఈతొమ్మిదేళ్లకాలంలోనూయుద్ధం ఏమీ జరగలేదుగాని గ్రీకు శిబిరంలోనూ, బయటా కూడా అక్రమాలు అనేకం జరిగాయి.]

ట్రోయ్‌నగరాన్ని గ్రీకులు ముట్టడించి తొమ్మిదేళ్ళు నిండుతున్నది. చలికాలం వచ్చింది. చలికాలంలో యుద్ధం జరగదు. అందుచేత గ్రీకులు ఈ రోజులలో తమ సైనిక శిబిరాన్ని విస్తరింపజేసుకుని, విలువిద్య సాధన చేస్తూ కాలం వెళ్ళబుచ్చారు.

యుద్ధభూమికి కొంత దూరాన సూర్య భగవానుడి ఆలయం ఒకటి ఉన్నది. ఇది తటస్థ ప్రాంతం. ఈ దేవుడికి బలులు ఇవ్వటానికిగాను గ్రీకులూ, ట్రోజనులూ కూడా వెళుతూ ఉండేవాళ్ళు. ట్రోయ్‌నగరపు ప్రముఖులు ఈ ఆలయంలోనే గ్రీకులకు అప్పుడప్పుడూ కనిపించేవారు.

ఒకనాడు వజ్రకాయుడు ఈ ఆలయంలో బలులివ్వటానికి వచ్చేసరికి, అక్కడ అతనికి వర్ధనుడి భార్యా,కుమార్తే కనిపించారు. వారు కూడా దేవుడికి బలులు ఇవ్వటానికే వచ్చారు. వర్ధనుడి కుమార్తె ప్రమోదిని అత్యంత సౌంద




ర్యవతి. ఆమెను చూస్తూనే వజ్రకాయుడు అంతులేని ప్రేమావేశం పొందాడు. అతను శిబిరానికి తిరిగివస్తూనే ఒక దూతను వీరసిం హుడివద్దకు పంపాడు. "వజ్రకాయుడు నీ చెల్లెలయిన ప్రమోదినిని వివాహమాడ గోరు తున్నాడు," అని ఈ దూత వీరసింహుడితో చెప్పాడు.

"నీవు గ్రీకు శిబిరాన్ని విడనాడి నాతండ్రి అయిన వర్థనుడి పక్షం వచ్చినట్టయితే నా చెల్లెలిని వివాహమాడవచ్చు. గ్రీకులకు ద్రోహం చెయ్యలేని పక్షాన కనీసం మీ వీరులలో భూధవుడనేవాడినీ, మరికొందరు వీరులనూ హత్యచేస్తానని ప్రమాణం చెయ్యి!"అని వీర సింహుడు వజ్రకాయుడికి జవాబు పంపాడు.

వజ్రకాయుడు ఈ షరతులకు లోబడటా నికి వెనకాడాడు. ఇంతలో శీతాకాలం వెళ్లి పోయి వసంతం ఆరంభమయింది. దానితో బాటు యుద్ధం కూడా మళ్ళీ సాగింది. యుద్ధ రంగాన ఎలాగైనా వీరసింహుణ్ణి కలవాలని వజ్రకాయుడు చాలా యత్నించాడు, కాని ఈ యత్నాలు ఫలించలేదు. ఒకసారి అతను వీరసింహుడికేసి వెళ్ళే సమయంలో, వీరసిం హుడి తమ్ముడొకడు వజ్రకాయుడి అరిచేతిలో బాణం కొట్టి గాయపరిచాడు.

యుద్ధ వైఖరి చూస్తే దేవతలు గ్రీకులకు ప్రతికూలంగా ఉన్నట్టు కనబడింది.

లోగడ వజ్రకాయుడు ట్రోయ్ పరిసర రాజ్యాలను కొల్లగొట్టినప్పుడు అనేకమంది స్త్రీలు అతనికి బానిసలుగా చిక్కారు. వీరిలో హేమ అనే పిల్ల ఒక్కతే, భామిని అనే పిల్ల ఒక్కతే ఉన్నారు. గ్రీకువీరులు ఈ బానిసలను పంచుకునేటప్పుడు హేమ రారాజు వంతూ, భామిని వజ్రకాయుడివంతూ కావటం జరిగింది.

వీరిలో హేమ తండ్రి పేరు హేమాంబరుడు. ఆయన సూర్యోపాసకుడు; తన కుమార్తెను గ్రీకులనుంచి తిరిగి తెచ్చుకునే ఉద్దేశంతో, కొన్ని కానుకలు రారాజుకు అర్పించి తన కుమార్తెను విడిచిపుచ్చమని కోరాడు.

కాని రారాజు ఆయన మాట వినిపించు కోక, ఆయన ఇచ్చిన కానుకలు తీసుకోక హేమాంబరుణ్ణి నానా తిట్లూ తిట్టి వెళ్ళ గొట్టించాడు. ఈ సంఘటన జరిగినది లగా

యతు ప్రతిరోజూ గ్రీకు శిబిరంపై ఎటునుంచో వచ్చి బాణాలు పడటమూ, ఆ కారణంగా గ్రీకు సైనికులు వందలాదిగా చావటమూ జరిగింది. ఇలా పదిరోజులు గడిచినమీదట, గ్రీకు నౌకలకు మార్గదర్శకుడుగా వచ్చిన కాంశుకుడు ఒక సంగతి బయటపెట్టాడు.

"హేమాంబరుడు సూర్యోపాసకుడు. సూర్యుడికి అత్యంత ప్రియుడు. అతను తన కుమార్తెను విడిచిపుచ్చమని రాగా, రారాజు దుర్భాషలాడి పంపాడు. హేమాంబరుడు సూర్య భగవానుణ్ణి వేడుకొనగా, ఆయన మనపై ఈ బాణాలు వేసి శిక్షిస్తున్నాడు! ఈ ప్రమాదం నుంచి తప్పించుకోవాలంటే హేమను సగౌరవంగా వెంటనే ఆమె తండ్రి వద్దకు పంపాలి!" అని కాంశుకుడు చెప్పాడు.



రారాజు ఈ మాటలు నమ్మి, హేమను తక్షణమే హేమాంబరుడివద్దకు పంపి, తనను అడిగే వాడుండడనే ఉద్దేశంతో, వజ్రకాయుడి వంతు వచ్చిన భామిని అనే పిల్లను తాను తీసుకున్నాడు.

ఇది చూసి వజ్రకాయుడికి పట్టరాని ఆగ్రహంవచ్చింది, "ఇకమీదట నాకీ యుద్ధంతో ఏమీ సంబంధం లేదు. నేనింక ఈ యుద్ధంలో పాల్గొనేది లేదు!" అని అతను శపథం చేశాడు. అతను అదివరకే ప్రమోదినిని ప్రేమించి ఉన్నాడు; ఆమె తండ్రి అయిన వర్ధనుణ్ణి తృప్తిపరచేటందుకు వజ్రకాయుడి కిది చాలా మంచి అవకాశం కూడా అయింది. వజ్రకాయుడితోబాటు అతని సేనలు కూడా యుద్ధరంగంనుంచి వైదొలిగాయి.

గ్రీకులపక్షాన ఇకమీదట యుద్ధం చేయనని వజ్రకాయుడు శపథం చేసినట్టు వినగానే ట్రోజనుల ఆనందానికి మేరలేదు. వారు ఎంతో ఉత్సాహంతో గ్రీకులపైకి బ్రహ్మాండంగా దాడి ఎత్తివచ్చారు. ఈ దాడి చూసి రారాజుకు గుండె చలించిపోయింది. యుద్ధ విరమణ కోసం ఆయన ట్రోజనులకు వార్త పంపాడు.

యుద్ధం నిలుపు చేయబడింది. ఈ పోరాటమంతా భువనసుందరికోసమే గనక, ఆమె ఎవరిది కావాలో నిర్ణయించటానికిగాను ఆమె భర్త అయిన ప్రతాపుడికీ, ఆమెను ఎత్తుకుపోయిన మోహనుడికీ మధ్య ద్వంద్వ




యుద్ధం జరిగేటట్టు నిర్ణయించారు. ప్రతాపుడూ, మోహనుడూ ద్వంద్వ యుద్ధం చేశారు. కాని ఇది ఆసాంతం నడవలేదు: మధ్యలోనే మోహనుడు మాయమయ్యాడు. కామినీదేవత అతన్ని తన మాయాప్రభావం చేత అదృశ్యుణ్ణి చేసి ట్రోయ్‌కి చేర్చిందన్నారు.

ద్వంద్వయుద్ధం ఎటూ తేలకపోగా, యుద్ధ విరమణకు భంగంకూడా కలిగింది! కంటకుడు అనే ట్రోజన్ వీరుడు ప్రతాపుడిపై బాణం వదిలాడు. ఇది చూసి మండిపడి దేవమయుడు కంటకుణ్ణి చంపి, ప్రశంసనుణ్ణి గాయపరిచాడు.

ఇది జరిగిన అనంతరం వీరసింహుడు వజ్రకాయుణ్ణి తనతో ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించాడు. కాని వజ్రకాయుడు తాను యుద్ధరంగం నుంచి విరమించుకున్నానని జవాబు పంపాడు. వీరసింహుడితో ద్వంద్వ యుద్ధం చేయటానికిగాను గ్రీకులు భూధవుణ్ణి ఎన్నుకున్నారు. ఎందుకంటే వజ్రకాయుడి తరవాత గ్రీకు వీరులలో చెప్పుకోదగిన మహా వీరుడు భూధవుడే.

వీరసింహుడూ, భూధవుడూ సూర్యాస్తమయందాకా ద్వంద్వయుద్ధం చేసినా ఒకరు ఓడటంగాని, ఒకరు గెలవటంగాని జరగలేదు. వారు సమ ఉజ్జీలుగా పోరాడారు. సూర్యాస్తమయం కాగానే వారు యుద్ధం నిలుపుచేసి, ఒకరి శౌర్యపరాక్రమాలను ఒకరు ప్రశంసించి, ఒకరికొకరు బహుమానాలుకూడా ఇచ్చుకున్నారు.

ఉభయపక్షాలూ తాత్కాలిక యుద్ధ విరమణకు ఒప్పుకున్నాయి. గ్రీకులు తమ యుద్ధ నిహతుల నందరినీ పాతిపెట్టి, అక్కడ నిడుపైన దిబ్బ నిర్మించి, దానిమీద ఒక గోడకట్టారు. ఈ గోడకు ముందుగా ఒక లోతైన కందకం తవ్వి, దాని ముందుగా ఒక కంచె అమర్చారు.

ఆ తరవాత తిరిగి యుద్ధం ఆరంభమయింది. ఈ యుద్ధంలో గ్రీకులు ఘోర పరాజయం పొందారు. ట్రోజనులు వారిని కందకంమీదుగా గోడ అవతలికి తరిమివేశారు. ఆ రాత్రి ట్రోజనులు సముద్రతీరాన్ని చేరి, గ్రీకునౌకలకు చాలాకొద్ది దూరంలోనే మకాం వేశారు.




గ్రీకు సర్వసేనాని అయిన రారాజు నిస్పృహ చెందాడు. ఏ విధంగానైనా వజ్రకాయుణ్ణి తిరిగి యుద్ధంలోకి రప్పించాలి. లేకపోతే అపజయం తప్పదు. రక్తవర్ణుడు, ధూధవుడు, రూపధరుడు, మరి ఇద్దరూ కలిసి రారాజు తరఫున వజ్రకాయుడివద్దకు దౌత్యం వెళ్ళారు. వారి ద్వారా రారాజు వజ్రకాయుడికి అంతు లేని బహుమానాలు పంపుతూ, "నీ భామినిని నువ్వే తీసుకో! యుద్ధంలో వచ్చిచేరు!" అని వర్తమానం చేశాడు.

రారాజు భామినిని వజ్రకాయుడికి తిరిగి ఇస్తాననటానికి మరొక కారణంకూడా ఉన్నది. తండ్రి దగ్గిరికి పంపబడిన హేమ, "నేను ఇక్కడ ఉండను.రారాజు దగ్గర నాకు చాలా సుఖంగా జరిగిపోతున్నది!" అని తండ్రితో పోట్లాడి, రారాజు వద్దకు తిరిగి వచ్చేసింది!

రారాజు దూతలతో వజ్రకాయుడు ప్రేమ గానే మాట్లాడాడు, కాని తన నిర్ణయం మార్చు కోవటానికి అతను ఎంతమాత్రమూ ఒప్పుకో లేదు. "రేపు ఉదయమే నేను నా నావలను తరలించుకుని దేశానికి తిరిగి పోతున్నాను!" అనికూడా అతను దూతలతో చెప్పాడు.

ఆ రాత్రే రూపధరుడూ, దేవమయుడూ కలిసి ట్రోజనుల శిబిరంపై దాడిచేయ తల పెట్టారు. వారా పనిమీద బయలుదేరి పోతూం డగా దారిలో వారికి ట్రోజనులు పంపిన వేగులవాడొకడు తటస్థపడ్డాడు. ఇద్దరు గ్రీకు వీరులూ వాడిపై బడి బలాత్కారంగా శత్రువుల రహస్యాలు బయటపెట్టించి, వాణ్ణి కాస్తా చంపేశారు.

వాడు ముఖ్యమైన రహస్యం ఒకటి బయట పెట్టాడు; అదేమంటే :

విచ్ఛేదనుడు అనే త్రేస్‌దేశపు రాజు అంత కుపూర్వమే తన సిబ్బందితోనూ, పాలమీగడ లాటి తెల్లని రంగు గల మేలు జాతి అశ్వాల తోనూ వచ్చి ట్రోజన్ సైనిక శిబిరంలో విడి శాడు. ఆ గుర్రాలు వాయు వేగాన్ని మించి పోగలవి. అవి ట్రోయ్ నగరంలో మేసి, ఆ నగరానికి దక్షిణంగా ప్రవహించే స్కామందర్ నదిలో నీరు తాగిన పక్షాన ట్రోయ్‌ని ఎవరూ జయించలేరని ఒక ప్రతీతి ఉన్నది. విచ్ఛే దనుడి గుర్రాలింకా ఈ రెండు పనులూ

చేయలేదు. విచ్ఛేదనుడు ఆ రాత్రి ట్రోజను శిబిరంలో కుడిపార్శ్వాన ఒక డేరాలో మకాం చేసినట్టు గ్రీకు వీరులు వేగులవాడి ద్వారా తెలుసుకున్నారు. రూపధరుడూ, దేవమయుడూ వేగులవాణ్ణి చంపి, నేరుగా విచ్ఛేదనుడి డేరాకు వెళ్ళారు. గాఢనిద్రలో ఉన్న విచ్ఛేదనుణ్ణీ, అతని అనుచరులు పన్నెండు మందినీ చంపారు. విచ్ఛేదనుడి వెంట వచ్చిన తెల్ల గుర్రాలను విప్పుకుని, విజయోత్సాహంతో తమ శిబిరానికి వెళ్ళిపోయారు.

తరవాత కొద్దిసేపటికి విచ్ఛేదనుడి పరిజనులు నిద్రలేచి తమ రాజూ, అతని అనుచరులూ వధించబడినట్టు తెలుసుకుని కంగారుపడి, తిరిగి పారిపోసాగారు. గ్రీకులు దారి కాసి వారందరినీ తుద ముట్టించారు.

ఇంత జరిగినా, గ్రీకులకు మర్నాడు యుద్ధభూమిలో మళ్ళీ అపజయమే ఎదురయింది. ట్రోజనులచేతిలో, అంతకు పూర్వం వారింత అపజయం ఎరగరని చెప్పాలి. యుద్ధంలో రారాజూ, దేవమయుడూ, రూపధరుడూ మొదలైన ముఖ్య వీరులందరూ గాయాలు తిన్నారు.

రణరంగాన సింహానికి ఏమాత్రమూ తీసిపోని ట్రోజను మహావీరుడు వీరసింహుడు గ్రీకులను తరిమికొట్టాడు. వారు నిర్మించిన గోడను ఛేదించాడు. అక్కడితో ఆగక అతను ఇంకా ముందుకు చొచ్చుకుపోయి గ్రీకు సైనిక శ్రేణులనే భేదించాడు. గ్రీకు వీరులందరూ కలిసి విశ్వప్రయత్నాలు చేసి కూడా వీరసింహుడి ధాటిని కొంచెం కూడా ఆపలేకపోయారు.

భూధవుడు విసిరిన గండశిల ఒకటి వీరసింహుడికి గురిగా తగిలి, క్షణంపాటు అతను పడిపోయినట్టే కనిపించాడుగాని, అంతలోనే మళ్ళీ తేరుకుని తన సైనికులకు అంతులేని ఉత్సాహం కలిగించాడు.

చూస్తూండగానే ట్రోజనులు గ్రీకు నౌకలను చేరుకున్నారు. ఒక నావకు నిప్పు అంటించారు. ఆ నావ చంద్రప్రభుడిది. గ్రీకునావలు ట్రోయ్‌తీరాన్ని చేరగానే అందరికన్న ముందుగానేలమీదికి దూకి, అందరికన్న ముందుగా తన ప్రాణాలు కోల్పోయిన గ్రీకువీరుడు ఈ చంద్రప్రభుడే! — (ఇంకావుంది)



## విశ్రాంతి తీసుకుంటూ నడిపే వాహనం!

హాయిగా వెనక్కు ఆనుకుని కూర్చుని నడపడానికి వీలుగా ఇటీవల ఒక స్కూటర్‌ను రూపొందించారు. దీనిని నడుపుతూ వుంటే, చక్రాల కుర్చీలో కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్నట్టే వుంటుంది. మూడు చక్రాలు గల ఈ స్కూటర్ ఒక్కొక్క చక్రం 60 సెం.మీ. (16 అంగుళాలు)అర్ధుకొలత కలిగి వున్నది. ఇవి 15 సెం. మీ (6 అంగుళాలు) ఎత్తు పల్లాలను సులభంగా దాటగలవు. ఈ వాహనానికి 24వోల్టేజ్ ఎలక్ట్రిక్ మోటార్,3 పుష్‌బటన్లుఅమర్చబడి వున్నాయి. ఇది వేగంగానూ, నిదానంగానూ; ముందుకూ, వెనక్కూ నడవ గలదు. మూడు బ్రేకింగ్ పద్ధతులు ఉన్నాయి. కావాలంటే దీనిని ఊడదీసి కారువెనక డిక్కీలోవేసుకునివెళ్ళవచ్చు. ఇన్ని సౌకర్యాలుగల ఈ వాహనాన్ని ఎవరి కోసం రూపొందిచారనుకున్నారు? కాళ్ళు చేతులు బావున్న మామూలు పిల్లలకు కాదు. వికలాంగుల సౌకర్యార్థం దీనిని రూపొందించారు.



## పాడడంలో రికార్డు!

మద్రాసుకు చెందిన కొందరు కళాశాల విద్యార్థులు కలిసి 'లక్ష్మణ్ శ్రుతి' అనే ఒక సంగీత బృందం ఏర్పాటు చేసుకుని, దాని ద్వారా లలిత సంగీతం ముఖ్యంగా సినిమా పాటలు పాడి శ్రోతలను అలరిస్తున్నారు. వీరు గత డిసెంబర్ 17వ తేదీ నిర్విరామంగా 36 గంటలసేపు సినిమా పాటలు పాడి సరికొత్త రికార్డు సృష్టించారు. వీరు తమ సామర్థ్యం అంతర్జాతీయంగా గుర్తింపు పొందాలని 'గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్' సంస్థకు తెలియజేశారు.

## వేగమే కాని ప్రమాదం లేదు!

'షిన్ కాన్‌సెన్' అనే బుల్లెట్ ట్రెయిన్ గత ముప్పై సంవత్సరాలుగా జపానులోని టోక్యో -- ఒసాకా నగరాల మధ్యగంటకు 220 కి.మీ. వేగంతో నడుస్తున్నది. అయితే అది ఇంతవరకు ఒక్క ప్రమాదానికి కూడా లోనుకాలేదు. 1964వ సం॥ అక్టోబర్ 1వ తేదీ నడవడం ప్రారంభించిన ఈ రైలు జపానులో వేగంగా నడిచే రైళ్ళకన్నిటికీ 'మార్గదర్శి'అని చెప్పవచ్చు. దీని తరవాత వచ్చిన రైళ్ళు కొన్నిటిని అప్పుడే ఆపేశారు.కానిదీనినిమాత్రం ఆపకుండా నడుపుతున్నారు.గంటకు 270కి.మీ. వేగంతో నడిచే 'నోజోమీ'అనే రైలును 1992వసం॥లో ప్రవేశపెట్టారు. దీని ద్వారా టోక్యో - ఒసాకాల మధ్య (518 కి.మీ.) ప్రయాణ సమయం 19 నిమిషాలు తగ్గుతుంది.అయినా, కొన్ని ఇబ్బందులవల్ల దీనిని నడపలేకపోతున్నారు.అయితే 'షిన్‌కాన్‌సెన్' ఎటువంటి ఇబ్బందులూ లేకుండా ఇంకా నడుస్తూనే ఉన్నది!






# రాక్షసుడి దానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, కన్ను పొడుచుకున్నా కానరాని కటిక చీకటి మధ్య, ఒళ్ళు జలద రింపజేసే ఈ శ్మశానంలో నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే, ఒక్కొక్కసారి నీపట్ల జాలితో పాటు కోపం కూడా కలుగుతున్నది. ఎందు కంటే – కేవలం స్వార్థబుద్ధితో తన ఒక్కడి మేలు కోసమే ఏదైనా అలౌకికశక్తిని సాధించాల నుకునేవాడు, కొద్దిపాటి అవాంతరాలూ, ఇక్కట్లూ ఎదురవగానే ఆత్మస్థైర్యాన్ని కోల్పోయి వెనుకంజ వేస్తాడు. అలా కాక, ఇతరులకు చేసిన వాగ్దానం నిలుపుకునేందుకో లేక సమాజ శ్రేయస్సు కోసమో పూనుకున్నవాడు, తన ప్రయత్నంలో అవసరం అయితే ఆత్మార్పణ చేయగలడు. అయితే, కొన్ని సమయాల్లో ఏది

## బేతాళ కథలు



తనమేలో, ఏది సమాజ శ్రేయస్సుకు దోహదం చేస్తుందో తెలియని అవివేకులైన మొండి పట్టుదలగల మనుషులు కూడా వుంటారు. నిన్ను ఈ కష్టకార్యానికి పురిగొల్పిన వాడు ఎలాంటి వాడో నాకు తెలియదు. ఒకవేళ నువ్వు ఎంతో కష్టపడి సాధించిన దాన్ని ఏ అపాత్రుడికో దానం చేయగలవేమో అన్న శంక కలుగుతున్నది. అపాత్రదానం పాపకారణమవుతుందన్నారు పెద్దలు. ఇది మానవులకే కాదు; రాక్షసులకైనా, దేవతలకైనా వర్తిస్తుంది. రక్తతర్పణుడనే రాక్షసుడు, తను గడించిన అలౌకిక శక్తులుగల మణిని, అవివేకంగా ఎలా అపాత్రదానం చేశాడో చెబుతాను, శ్రమతెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

దండకారణ్యంలో రక్తతర్పణుడనే రాక్షసుడుండేవాడు. ఆ అరణ్యం హిమగిరి, సింహపురి అనే రెండు రాజ్యాలను కలిపేది. అందువల్ల అటుగా చాలా మంది బాటసారులు ప్రయాణం చేస్తూండేవారు. రక్తతర్పణుడు దొరికిన వారిని దొరికినట్లు చంపి తినేవాడు.

ఒక పర్యాయం చంద్రకాంత అనే గంధర్వ కన్య భూలోకంలోని వింతలు చూడడానికి వచ్చింది. ఆమె అద్భుత సౌందర్యరాశి. ఎంతో దయాస్వభావం కలది. ఆమె దండకారణ్యంలో విహరిస్తూండగా, ఆమె మెడలో ధరించిన మణి ఒకటి జారి కింద పడింది. చంద్రకాంత అది గమనించలేదు. కొంతసేపటికి ఆమె అక్కడినుంచి గంధర్వలోకానికి వెళ్ళిపోయింది.

రక్తతర్పణుడు అరణ్యంలో బాటసారుల కోసం వెదుకుతూండగా, వాడికి చంద్రకాంత పోగొట్టుకున్న మణి కనిపించింది. అది వింత కాంతులు విరజిమ్ముతున్నది. రక్తతర్పణుడు దాన్ని తీసుకుని, బాగుందని మురిసిపోతూ మెడలో హారంగా ధరించాడు.

ఆ మణిని ధరించగానే రక్తతర్పణుడిలో విపరీతమైన భావ సంచలనం కలిగింది. పరమ క్రూరుడైన వాడి హృదయంలో ఒక్కసారిగా దయ, కరుణ చోటు చేసుకున్నాయి.

అంతలో వాడి దృష్టి అటుగా ప్రయాణం చేస్తున్న బాటసారుల మీద పడింది. ఒక చిన్న పిల్లవాడు తండ్రిని ఎత్తుకోమని మారాం చేస్తున్నాడు. తండ్రి, నా దగ్గర ఓపికలేదు

నడవమని వాణ్ణి కోప్పడుతున్నాడు. ఇది చూసి రక్తతర్పణుడు వాళ్ళ ముందుకు వెళ్ళి, "చిన్నవాడు నడవలేక పోతూంటే ఆ మాత్రం ఎత్తుకోలేవా? నా భుజాల మీద కూర్చోండి, క్షణంలో గమ్యం చేరుస్తాను," అన్నాడు.

రాక్షసుణ్ణి చూడగానే బెంబేలెత్తి పోయిన ఆ బాటసారి,కొడుకునెత్తుకుని అక్కడి నుంచి పారిపోయాడు.

బాటసారి కనిపించగానే విరుచుకుతిని ఆకలి తీర్చుకోవలసిన తను, వాడికి సహాయ పడాలనుకోవడం రక్తతర్పణుడికి చాలా ఆశ్చర్యం కలిగించింది. వాడు తనకేం జరిగిందా అని విచారపడుతూ, ఒక చెట్టు కింద కూర్చున్నాడు. వాణ్ణి అటుగా పోతున్న ధర్మవేదుడు అనే ముని చూశాడు. ఆయన గొప్ప తపశ్శక్తి సంపన్నుడు.

ఆయన రక్తతర్పణుడి విచారానికి కారణం గుర్తెరిగి, వాణ్ణి సమీపించి, "రాక్షసా! నీ ప్రవర్తన నీకే వింతగా వున్నది కదా! దానికి కారణం నువ్వు మెడలో ధరించిన మణి. ఆ మణి ఎంతో దయామయురాలైన చంద్రకాంత అనే గంధర్వకన్యది. ఆ మణికి మనస్సులోని కోర్కెలను తీర్చగల మహిమ వున్నది. అందు వలన నువ్వు ఇతరులకు సహాయపడాల నుకుంటే మనుష్యరూపం ధరించి సహాయ పడవచ్చు," అని చెప్పి ముందుకు సాగిపోయాడు.



ముని చెప్పిందివిన్న రక్తతర్పణుడు, మణి ప్రభావం పరీక్షించడానికి మనుష్యరూపం కావాలని కోరుకున్నాడు. మరుక్షణం వాడి రూపు మానవుడిగా మారిపోయింది.

ఆనాటి నుంచి రక్తతర్పణుడు,ఆ అరణ్యం గుండా ప్రయాణించే బాటసారులకు సహాయంచేయసాగాడు. వాళ్ళను దోచుకునే దోపిడి దొంగలను తుదముట్టించాడు. బాటసారులు నీళ్ళకోసం ఇబ్బంది పడకుండా మార్గంలో అక్కడక్కడా బావులు తవ్వాడు. ముళ్ళ పొదలనునరికి మార్గాన్ని మరింత సుగమం చేశాడు.

అయితే, ఎవరూ ఊహించని అవాంతరం ఒకటి వచ్చి పడింది. ముని ధర్మవేదుడు, రక్తతర్పణుడికి మణి ప్రభావం వివరిస్తూం

డగా, అక్కడ వున్న చెట్టు కొమ్మ మీద దాగి వున్న ఆదిత్యుడనే సింహపురి గూఢచారి విన్నాడు. సింహపురి రాజు విక్రమభూపతికి రాజ్య కాంక్ష ఎక్కువ. ఆయన పొరుగు రాజ్యం హిమగిరి మీద యుద్ధం ప్రకటించి, దాన్ని తన రాజ్యంలో కలుపుకోవాలని పథకం వేశాడు.

హిమగిరి రాజు విజయాదిత్యుడు ధర్మ ప్రభువు. ఆయన పాలనలో రాజ్యం సుభిక్షంగా వున్నది. ప్రజలు సుఖ సంతోషాలతో కాలం గడుపుతున్నారు.

విక్రమభూపతి యుద్ధ ప్రతిపాదన విని, విజయాదిత్యుడు తల్లడిల్లిపోయాడు. కారణం, హిమగిరిఆర్థికంగానూ,సైనికపరంగానూసింహపురితో పోలిస్తే బలహీనమైనది. విజయాదిత్యుడు పంపిన సంధి ప్రతిపాదనకు, విక్రమభూపతి అంగీకరించకపోవడంతో యుద్ధం తప్పనిసరి అవబోతున్నది.

సింహపురి గూఢచారి ఆదిత్యుడు సింహపురిచేరి, రాజు విక్రమభూపతికి తను అరణ్యంలో చూసినది చెప్పి, రాక్షసుడి నుంచి మహిమగల మణిని సంపాయించితే చుట్టు పక్కలగల అన్ని రాజ్యాలనూ జయించవచ్చని వివరించాడు.

ఇది విన్న విక్రమభూపతికి అప్పుడే తను చక్రవర్తి అయినంత ఆనందం కలిగింది. ఆయన రక్తతర్పణుడి సహాయం అర్థించడానికి రథం మీద బయలుదేరాడు.

అదే సమయంలో హిమగిరిరాజు విజయాదిత్యుడు, రానున్న యుద్ధం గురించి తన



ప్రజలు ఏమనుకుంటున్నారో తెలుసుకునేందుకు మారువేషంలో రాజ్య సంచారానికి బయలుదేరాడు. ఒకచోట అయనకు ఒక చెట్టు కింద విశ్రాంతి తీసుకుంటున్న ముని ధర్మవేదుడు కనిపించాడు. ఆయన ముఖంలోని దివ్యతేజస్సు గమనించిన విజయాదిత్యుడు, అయనను సమీపించి వినయంగా నమస్కరించి చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

ధర్మవేదుడు, రాజును తేరిపార చూసి, "రాజా! నీ మనసులోని ఆవేదన గ్రహించాను. సింహపురి రాజు విక్రమభూపతిని ఎదుర్కోవాలంటే, ఒకేఒక మార్గమున్నది. నువ్వు వెంటనే బయలుదేరి దండకారణ్యానికి వెళ్ళు. అక్కడ రక్తతర్పణుడనే రాక్షసుడున్నాడు. వాడిప్పుడు ఒక మణి ప్రభావంవలన మారిపోయి మనుష్యరూపంలో ఆపదలో వున్నవారికి సహాయపడుతున్నాడు. వాడి మెడలోని మణి కారణంగా నువ్వు వాడిని గుర్తించవచ్చు. వాడికి పరిస్థితి వివరించి, ఆ ప్రభావంగల మణిని సంపాయించే ప్రయత్నం చెయ్యి," అని సలహా ఇచ్చాడు.

విజయాదిత్యుడు, రక్తతర్పణుణ్ణి కలుసుకునేందుకు గుర్రం మీద వెంటనే బయలుదేరాడు. కాని, ఈలోపలే సింహపురి రాజు విక్రమభూపతి, మనుష్యరూపంలో వున్న రక్తతర్పణుణ్ణి కలుసుకుని, "రాక్షసోత్తమా, తమ గురించి విన్నాను. నేను సింహపురి రాజైన విక్రమ భూపతిని.తమలోతాము కీచులాడుకుంటున్న అన్ని రాజ్యాలనూ ఏక ఛత్రాధిపత్యం కిందికి తీసుకువచ్చి, ప్రజారంజకంగా





పాలన చేయాలనే సదుద్దేశంతో, తమదర్శ నానికి వచ్చాను. మీరు దయతలచి ప్రభావం గలమణినినాకిస్తే,ఎందరికోసహాయం చేసిన వారవుతారు," అని వేడుకున్నాడు.

దానికి రక్తతర్పణుడు, "నేను ముందుగా నీ రాజ్యానికి వచ్చి, నీ పాలన ఎలా వున్నదో చూడాలి. ఆతర్వాత మాత్రమే మణిని నీకిచ్చే సంగతి నిర్ణయించగలను," అన్నాడు.

విక్రమభూపతి, రాక్షసుడికి కృతజ్ఞతలు చెప్పుకుని తన రాజధానికి వెళ్ళిపోయాడు.

ఆమర్నాడు విజయాదిత్యుడు, అరణ్యంలో రాక్షసుణ్ణి గుర్తించి, "మహానుభావా! నేను హిమగిరి రాజు విజయాదిత్యుణ్ణి. సింహపురి రాజు విక్రమభూపతిరాజ్యకాంక్షతో,నారాజ్యాన్ని ఆక్రమించుకోవాలనుకుంటున్నాడు. మీ మణి సహాయంతో తప్ప అతణ్ణి నేను జయించలేను. ధర్మబద్ధుడినైన నాకు సహాయపడగలరని నమ్ముతున్నాను," అన్నాడు.

అందుకు రక్తతర్పణుడు, "రాజా, విచారిం చకు. నీ రాజ్యానికి వచ్చి ప్రజల స్థితి ఎలా వున్నదీ గమనించాక, నీకు సహాయం చేసే విషయమై నిర్ణయం తీసుకుంటాను. నీ శత్రువైన విక్రమభూపతికూడా ఇలాగే మాట ఇచ్చాను," అన్నాడు.

విజయాదిత్యుడు, రక్తతర్పణుడికి నమస్క రించి తన రాజ్యానికి వెళ్ళిపోయాడు.

రక్తతర్పణుడు ముందుగా హిమగిరి రాజ్యా నికి వెళ్ళాడు. అక్కడి పరిస్థితులను చూసి, విజయాదిత్యుడు ధర్మప్రభువనీ,అతడి పాల నలో ప్రజలు సుఖంగా వున్నారనీ గ్రహించాడు. ఆ రాజ్యాన్ని ఆక్రమించుకునేందుకు సింహ పురి రాజు సైన్యాన్ని ఆయత్త పరుస్తున్నాడని కూడా తెలుసుకున్నాడు. తర్వాత అతడు సింహ పురి రాజ్యం వెళ్ళాడు. అక్కడ రాజు విక్రమ భూపతి క్రూర పరిపాలన గురించీ, రాజ్యవిస్త రణకాంక్ష గురించీ క్షుణ్ణంగా తెలుసుకున్నాడు.

ఆ ఇద్దరు రాజుల్లో ప్రభావంగల మణిని ఏ రాజుకివ్వాలా అని రక్తతర్పణుడు కొంచెం సేపు ఆలోచించి, రాజు విక్రమభూపతిని కలు సుకుని, "రాజా! ఈ ప్రభావంగల మణిని నీకు ఇవ్వదలిచాను, స్వీకరించు!" అని మణిని ఆయనకిచ్చి, అరణ్యంకేసి సాగిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రక్తతర్ప ణుడుచేసింది కేవలం అపాత్రదానమే కదా! తన ప్రజలను అతి క్రూరంగా పరిపాలిస్తూం డడమే కాక, యుద్ధం ద్వారా పొరుగు రాజ్యా లను ఆక్రమించి చక్రవర్తి కావాలనుకునే కాంక్ష కలవాడు విక్రమభూపతి. ఈ విషయం రక్తతర్పణుడు స్వయంగా తెలుసుకున్నాడు. అటువంటి రాజుకు ప్రభావం గల మణి దానం చేయడమంటే, ఆ రాజు మరింత యథేచ్ఛగా తన ప్రజలనూ, పొరుగు రాజ్య ప్రజలనూ హింసలపాలు చేయడానికి సహాయ పడడమే కదా? ఇంత అవివేకమైన అపాత్రదా నానికి రక్తతర్పణుడు ఎందుకు పూనుకు న్నాడు? ఆ మణిని విక్రమభూపతికి కాక, ఎంతో శాంత స్వభావుడూ, ధర్మప్రభువూ అయిన విజయాదిత్యుడికి దానం చేసివుంటే, అతడు తనపై యుద్ధానికి రానున్న విక్రమ భూపతిని ఓడించి, ఆ రాజ్య ప్రజలనుకూడా ధర్మంగా పాలించి వుండేవాడు కదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రక్తతర్పణుడు చేసిన పని పైకి అవివేకంగా, అపాత్రదానంగా కనిపించవచ్చు. కాని, అతడు తన స్వాను భవాన్ని ఆధారం చేసుకుని ఎంతో వివేకంగా ప్రవర్తించాడు. దారేపోయే మనుషులను చంపి తినే క్రూర స్వభావుడైన తనను, ఆ మణి అతి సాధుస్వభావుణ్ణి చేసింది. అందువల్ల, రాజ్యకాంక్షతో యుద్ధాలు ప్రారంభించి ప్రజా క్షయానికి సిద్ధపడే విక్రమభూపతిని, ఆ మణి తప్పక సాధుస్వభావుణ్ణీ, ప్రజారంజకంగా రాజ్యం పాలించే ప్రభువునూ చెయ్యగలదు. వస్తుతః సాత్వికుడూ, ధర్మమార్గాన నడిచే విజయాదిత్యుడిపై కొత్తగా ఆ మణి చూపే ప్రభావం ఏమీ వుండదు. అందువల్ల దానిని అతడికి దానం చెయ్యడం వృథా. ఇదంతా ఆలోచించే రక్తతర్పణుడు మణిని పాత్రుడైన వాడికే దానం చేశాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు — (కల్పితం)

[ఆధారం : ఎన్. శివనాగేశ్వరరావు రచన]



# చక్రవర్తియోగం

ధర్మపురిని పాలించే అనంగపాలుడికి ఒక్కగానొక్క కుమార్తె. ఆమె పేరు లావణ్య, అద్భుత సౌందర్యవతి. ఆమె చదివిన శాస్త్రాలలో జ్యోతిషశాస్త్రం ఒకటి. ఆమె యుక్తవయస్కురాలు కాగానే, రాజు వరుడి కోసం అన్వేషణ ప్రారంభించాడు.

ఒకనాడు రాకుమారి, తండ్రితో, "నాన్నగారూ! నా జాతకంలో నా భర్త చక్రవర్తి అవుతాడని వుంది.రాజకుమారుల జాతకచక్రాలు తెప్పించండి.చక్రవర్తియోగం వున్న రాకుమారుణ్ణి వివాహం చేసుకుంటాను," అన్నది.

రాజు, అనేకమంది రాకుమారుల జాతకచక్రాలతోపాటు చిత్రపటాలు కూడా తెప్పించాడు. వాటిని చూసి ఎవరికీ చక్రవర్తి అయ్యే యోగం లేదని, రాకుమార్తె తేల్చివేసింది.

అప్పుడు రాజు, ఆమెతో, "అమ్మా! నువ్వు చిత్రపటాల్లో రాకుమారుడి అందచందాలు చూసి నీ సమ్మతి తెలియచెయ్యి. అతడి చక్రవర్తి యోగం సంగతి, నీ గురువు జ్యోతిషమార్తాండగారు పరీక్షిస్తారు," అన్నాడు.

ఆ మర్నాడే రాకుమారి, పొరుగు దేశపు యువరాజు చిత్రపటం చూసి ముగ్ధురాలైపోయింది. వెంటనే ముహూర్తం పెట్టించి రాజు, అతడితో తన కుమార్తె వివాహం వైభవంగా జరిపించాడు.

తన గురువు జ్యోతిషమార్తాండ కాశీ యాత్రలో వున్నాడు. మరి, తన భర్త జాతకచక్రాన్ని ఎవరు పరీక్షించినట్టు? రాకుమారి లావణ్య ఈ సందేహాన్ని తండ్రి దగ్గర వెలిబుచ్చింది.

దానికి రాజు చిరునవ్వుతో, "నీ జాతకంలో, నీ భర్త చక్రవర్తి అవుతాడని వున్నది కదా! అందువల్ల, పెళ్ళికుమారుడి జాతకం వేరే పరీక్షించనవసరం లేదనిపించింది," అన్నాడు.

— తాతా నారాయణమూర్తి



# మనదేశపు కోటలు - 1

## తొలినాటి కోటలు

పురాతత్వ పరిశోధన శాఖ 1960 ప్రాంతంలో రాజస్థాన్‌లోని ఎండిపోయిన సరస్వతీనదీ తీర శిథిల నగరంలో తవ్వకాలు ప్రారంభించింది. అక్కడ లభించిన నల్లగాజులను బట్టి ఆ నగరానికి 'కాళీబంగా' (కాళీ - నల్ల; బంగా - గాజులు) అని పేరు పెట్టారు. చుట్టూ కోటగోడలు కలిగిన కాళీబంగా నగరం క్రీ.పూ. 2200 – 1700 సంవత్సరాల మధ్య కాలానికి చెందినది. అంటే, ఇది సింధు లోయ నాగరికత కాలం నాటిదని భావిస్తున్నారు.

*రచన : మీరా ఉగ్రా*
*చిత్రాలు : గౌతమ్ సేన్*

అదే కాలఘట్టానికి చెందిన కొన్ని కోటలు గుజరాత్, రాజస్థాన్, హర్యానా ప్రాంతాలలో జరిపిన తవ్వకాలలోనూ బయటపడ్డాయి.

కోటలు ముఖ్యంగా శత్రువుల దాడుల నుంచి, దురాక్రమణల నుంచి భద్రత కల్పించేవి. అంతే కాదు. ఆ నాగరికతలు వెలయడానికి అధారాలయిన నదులు పొంగి వెల్లువలై ప్రవహించేప్పుడు అక్కడి ప్రజలకు రక్షణా శిబిరాలుగానూ ఇవి ఉపయోగపడేవి. ప్రధానమైన కోట ఎప్పుడూ ఎత్తయిన ప్రదేశంలో నిర్మించబడడానికి ఇదే కారణం.

ఋగ్వేదం, కోటలను దుర్గాలనీ, పురాలనీ పేర్కొన్నది. ఇంద్రుడికి పురందరుడు, అంటే — కోటలను జయించినవాడు అనేపేరు ఉన్నది.

యజుర్వేదానికి చెందిన ధనుర్వేదంలో కోటల నిర్మాణానికి సంబంధించిన సాంకేతిక విషయాలు విపులంగా

*సింధులోయ నాగరికత కాలానికి చెందిన కాళీబంగా*

వివరించబడ్డాయి. ధనుర్వేదం ఆరు విధాల కోటలను పేర్కొంటున్నది. అవి: కొండ మీద నిర్మించే గిరిదుర్గం; నీళ్ళ మధ్య నిర్మించే జలదుర్గం; అడవిలో నిర్మించే వనదుర్గం; నేల మీద నిర్మించే మహి దుర్గం; ఎడారి మధ్య నిర్మించే



పురందరుడయిన ఇంద్రుడు



జలదుర్గం

ధన్వా దుర్గం. చెట్ల మధ్య నిర్మించే వృక్ష దుర్గం. ఈ ఆరింటిలో కొండమీద నిర్మించే గిరిదుర్గమే చాలా శ్రేష్ఠమైనదిగా చెప్పబడింది. కోటలేని రాజు విషంలేని పాముకు సమానంగా వర్ణించబడ్డాడు.

రామాయణం – అయోధ్య, లంకా నగరాలలో వెలసిన కోటలను వర్ణిస్తున్నది. అయోధ్య కోట, చుట్టూ దాట డానికి అసాధ్యమైన లోతైన అగడ్తతో, ఎత్తయిన భయం కొలిపే బురుజులతో నిర్మించబడింది. లంక కోట ఆకాశాన్నంటే ప్రాకారాలతో, దుర్గ



సేతు నిర్మాణం

మారణ్యాలతో, నదీ నదాలతో, అగడ్తతో పరివేష్టింపబడి ఉండేది. అది దేవతలకు సైతం దుర్భేద్యమైనదిగా వర్ణించబడింది.

మహాభారతంలో– హస్తినాపురం, ఇంద్ర ప్రస్థం, మథుర, రాజగృహం, అహిచ్ఛత్రం, ద్వారక నగరాలలోని కోటలు కళ్ళకు కట్టినట్లు వర్ణించబడ్డాయి.



ఇంద్రప్రస్థంలోని కోటకు గోపురాల వంటి బురుజులు ఉండేవి. ఇక్కడి నుంచి పర్యవేక్షణకు వీలుగా నగర వ్యాప్తంగా రక్షణకు సంబంధించిన వేర్వేరు ఏర్పాట్లు నిర్దుష్టంగా చేయబడ్డాయి. కోటకు ప్రధాన ద్వారమే కాకుండా గరుడద్వారాలనే మరికొన్ని రహస్య మార్గాలు ఉండేవి.

అలహాబాదు సమీపంలో జరిగిన తవ్వకాలలో కౌశాంబి ఫుర్ శిథిలాలు బయటపడ్డాయి. పరీక్షిత్తు మునిమనమడయిన నిచాక్షు దీనిని నిర్మించినట్టు భావిస్తున్నారు.

బుద్ధుడి కాలంలో చంపా, రాజగృహ, సాకేత, వారణాసి ముఖ్యమైన కోటనగరాలుగా ఉండేవి. వాయవ్యభాగంలో తక్షశిల, పుష్కలావతి, గాంధార రాజ్యాలు చాలా శక్తివంతమైనవిగా ఉండేవి. అలెగ్జాండర్ చక్రవర్తి ధండెత్తి వచ్చినప్పుడు ఈ రాజ్యాలు దృఢంగా నిలబడిపోరాడాయి. అలెగ్జాండర్‌కు పుష్కలావతి కోటను పట్టుకోవడానికి ఒక నెలకుపైగా పట్టింది. పురుషోత్తముడితో

యుద్ధం, యుద్ధ రంగంలోని ఏనుగుల దృశ్యం, యుద్ధంలో చిన్న చిన్న తెగల భారత వీరులు చూపిన ధైర్యసాహసాలు అలెగ్జాండర్ సేనలను భయభ్రాంతుల్ని చేశాయి. అంతేకాదు: నాటి మగధను పాలించిన ధననందుడి గొప్ప సైనిక బలం గురించి విన్న గ్రీకు సేనలు భయపడ్డాయి. ఉత్తరోత్తరా చంద్రగుప్త మౌర్యుడు మగధను పాలించిన కాలంలో వచ్చిన



పాటలీపుత్ర కోట ద్వారాలు.

గ్రీకు యాత్రికుడు మెగస్తనీస్ మగధ రాజధాని పాటలీపుత్రంలోని బ్రహ్మాండమైన కోటను గురించి తన గ్రంథంలో వివరంగా పొందుపరిచాడు. కోట ప్రాకారం 40. కి.మీ|| కన్నా ఎక్కువ పొడవుగా ఉండేది. గోడ చుట్టూ 3.5 మీ|| లోతూ, 180 మీ|| వెడల్పు గల అగడ్త ఉండేది. అగడ్తలోని నీళ్ళలో మొసళ్ళు ఈదుతూ ఉండేవి. కోటకు 64 ద్వారాలూ, 570 బురుజులూ ఉండేవి.

మనదేశంలో కోటల నిర్మాణం క్రీ.పూ. 300 సం||ల నాటికే పరిపూర్ణతను సంతరించుకున్నది.

[ఇక్కడి చిత్రాలు, ఆయా కోటల వర్ణనలను ఆధారంగా చేసుకుని చిత్రకారుడు గీసినవి. చివరి చిత్రం సాంచీస్థూప కుడ్యశిల్పానికి రేఖాచిత్రం.]



కోట ముట్టడి




వింధ్యారణ్య ప్రాంతంలో, ఒక బంగారు నెమలి తిరుగుతున్నదనే వార్త కనకపురిలో గుప్పుమన్నది. కనకపురి మహారాజు విచిత్ర సేనుడికి అరుదైన, అపురూపమైన వస్తువులను సేకరించడం అలవాటు. అందువల్ల, ఆయన ఈ వార్త వింటూనే కొంతమంది భటులతో వింధ్యారణ్యానికి వెళ్ళాడు.

వింధ్యారణ్యంలో కొండ దిగువున ఒక కోయగూడెం వున్నది. ఆ గూడెం పెద్ద, రాజును సాదరంగా ఆహ్వానించి అతిథి మర్యాదలు చేశాడు. అప్పుడు రాజు తను ఆ ప్రాంతాల తిరిగే బంగారు నెమలిని పట్టవచ్చినట్టు అతడికి చెప్పాడు.

బంగారు నెమలి మాట వింటూనే కోయ పెద్ద ఎంతో విచారంగా, "ప్రభూ! ఆ బంగారు నెమలి కొన్నాళ్ళుగా ఈ ప్రాంతాల కనిపించటం లేదు. నెల రోజుల క్రితం నా కూతురు మోహిని, దానిని పట్టి తమకు కానుకగా ఇవ్వాలని అరణ్యంలోకి వెళ్ళింది. రాత్రయినా తిరిగి రాలేదు. ఆమె కోసం వెదకటానికి పోయిన మాకు, ఒకచోట బంగారు నెమలి ఈకా, బాణం మాత్రం కనిపించాయి," అంటూ పక్కన నిలబడి వున్న కోయకేసి తిరిగి చూశాడు.

వాడు గుడిసెలో మరొక గదిలోకి పోయి, కొన్ని మామూలు ఈకలతో గుడ్డలో చుట్టి వున్న బంగారు ఈకను తెచ్చి రాజు ముందు పెట్టాడు.

విచిత్రసేనుడు, ఆ బంగారు ఈకను పరీక్షగా చూసి, "ఆహా, అద్భుతం! ఈ నెమలి ఏ దేవలోకాన్నుంచో దిగి వచ్చినదయి వుండాలి. ఏమైనా, దీని కారణంగా నీ కూతురు కనబడకుండా పోయింది. బంగారు నెమలితో పాటు నీ కూతుర్ని కూడా వెతికి తెచ్చే ప్రయత్నంచేస్తాను," అంటూ భటులతో అరణ్యంలోకి వెళ్ళాడు.

రాఘవరాజు పట్టాభిరామరాజు



వాళ్ళు అరణ్యంలో బంగారు నెమలి కోసం చాలా చోట్ల గాలించారు. చివరకు సూర్యాస్తమయానికి ఇంకా గంట కాలం వున్నదనగా, భటుడొకడికి నెమలి గురివింద పొదల చాటున కనిపించింది. ఆ సమయంలో అది పడగ విప్పి బుసలు కొడుతూ తనను కాటు వేయచూస్తున్న పెద్ద సర్పంతో పోరాడు తున్నది. నెమలి, సర్పాన్ని తనకాళ్ళతో తన్నుతూ, మధ్య మధ్య ముక్కుతో పొడుస్తున్నది.

భటుడు సైగ చేయగానే గుర్రం మీద వున్న రాజుతో పాటు మిగతా భటులు నెమలిని ప్రాణాలతో పట్టుకునేందుకు వలయాకారంగా చుట్టుముట్టారు. అయితే, ఇది గమనించిన బంగారునెమలి అంత ఎత్తున గాలిలోకి ఎగిరి చప్పున దూరంగా వున్న గుబురు పొదల్లోకి దిగి, వాటి చాటున పారిపోసాగింది.

రాజు దాన్ని అనుసరించాడు. భటులు గుర్రంతో పాటు వేగంగా పరిగెత్తలేక ఆగిపోయారు. నెమలి రాజుకు అందినట్లే కనిపిస్తూ పోయి పోయి, ఒక సెలయేటి ఒడ్డున వున్న పూరిగుడిసెలోకి దూరింది.

ఆ గుడిసెలో వున్న అవ్వ దాన్ని ఎత్తుకుని, "మళ్ళీ ఏమి ఆపద వచ్చి పడింది?" అంటూ దాని బంగారు రెక్కల్ని ఆప్యాయంగా నిమరసాగింది.

రాజు విచిత్రసేనుడు గుడిసె ముందు తన గుర్రాన్ని దిగి లోపలికి వెళ్ళాడు. అప్పటికి బాగా చీకటి పడింది. కానీ అంత చీకటిలో కూడా బంగారు నెమలి ఈకల కన్నులు మణిదీపాల్లా ప్రకాశిస్తూ వుండడంతో, గుడిసె లోపల పట్టపగలులా వుంది.

రాజు, అవ్వ చేతుల్లోని బంగారునెమలి వైపు అబ్బురంగా చూస్తూ, "అవ్వా! ఈ బంగారు నెమలిని పట్టుకోవాలనే ప్రయత్నంలో నేనిటుగావచ్చాను. చివరికివంటింటి కుందేలులా, నీకు చిక్కిందన్న మాట! నెమలిని నాకిచ్చెయ్యి. బహుమానంగా ఈ రత్నాలహారం తీసుకో," అంటూ తనమెడలోనిహారాన్నితీయబోయాడు.

అవ్వ మహారాజు వైపు వింతగా చూసి, "భలేవాడివే నాయనా! ఇది నా పెంపుడు నెమలి. అంత కాదు కూడ దంటే, ఒక ఈక పీకి ఇస్తా తీసుకుపో," అన్నది.

రాజు చిరుకోపంగా, "నేనీ దేశాన్ని ఏలే మహారాజును. ఈ అరణ్యంలో వుండే చెట్టూ, చేమా, పక్షులూ, జంతువులూ అన్నీ నా ఆధీనంలో వున్నట్టే లెక్క. అలాంటప్పుడు ఈ బంగారునెమలి కూడా నాదే అవుతుంది!" అంటూ బంగారునెమలిని లాక్కోబోయాడు.

ఆ మరుక్షణం విద్యుద్ఘాతం తగిలినట్లు కింద పడిపోయాడు రాజు. కొద్దిసేపటికి తేరుకుని లేచి నిలబడుతున్న రాజుతో, అవ్వ, "చూడు, నాయనా! ఇది మామూలు నెమలి కాదు; దేవతాంశ కలది. నా అనుమతి లేనిదే ఎవ్వరూ దీన్ని తీసుకుపోలేరు. నిన్ను చూస్తే జాలి వేస్తున్నది. ఒక పని చెయ్యి. ఈ వీణ మీద మేఘమల్హారి రాగంలో ఒక పాట పాడు. కనీసం నీకు ఈ బంగారునెమలి గుడ్డయినా యిస్తా," అంటూ ఒక మూల వున్న వీణను దుమ్ము దులిపి రాజుకిచ్చింది.



రాజు పద్మాసనం వేసుకుని కూర్చుని, వీణను శృతి చేసి మేఘమల్హారి రాగంలో శ్రావ్యంగా ఒక గీతం పాడసాగాడు. నెమలి ఆనందంతో నాట్యం చేసి ఒక బంగారు గుడ్డు పెట్టింది. ఆ గుడ్డును అవ్వ, రాజు చేతిలో పెట్టి, "నాయనా! వారం రోజుల్లో ఈ గుడ్డు పగిలి బంగారు నెమలిపిల్ల బయటికి వస్తుంది. అయితే అంతవరకూ దీనికి సూర్యరశ్మి తగలకూడదు. మరొక సంగతి; ఈ బంగారుగుడ్డు గురించి ఎవ్వరికీ చెప్పకూడదు. అలా చెబితే దీని మహత్తు పోతుంది," అని హెచ్చరించింది.

రాజు సంతోషంగా బంగారు గుడ్డును తీసుకుని, గుర్రమెక్కి భటులతో కోటకు చేరుకున్నాడు. తర్వాత ఆయన ఆ గుడ్డును ఒక చందనపు బుట్టలో పెట్టి, ఒక ప్రత్యేక మందిరంలో భద్రపరిచాడు.

ఆరు రోజులు గడిచిపోయాయి. ఏడవ రోజు సాయంత్రం పన్నెండేళ్ళ రాకుమార్తె దీప్తిరేఖ, చెలికత్తెలతో దాగుడుమూతలాడుతూ, అనుకోకుండా బంగారు గుడ్డు వున్న మందిరంలో ప్రవేశించింది. అక్కడ ఆమెకు చందనపు బుట్ట కంటబడగానే, అందులో ఏమున్నదా అని చూడబోయింది.

బుట్టలో బంగారు రంగుతో మెరిసిపోతున్న గుడ్డును చూసి, రాకుమార్తె ఆశ్చర్యం చెంది,



దానిని తన చెలికత్తెలకు చూపాలని ఉద్యాన వనంలోకి వెళ్ళింది. ఆ సమయంలో సాయం కాలపు సూర్య కిరణాలు గుడ్డు మీద పడ గానే, గుడ్డు పెద్ద చప్పుడుతో పేలిపోయి, అందులోంచి బంగారు ఛాయతో మెరుస్తున్న జానెడు పామొకటి బయటికి వచ్చి, రాకుమార్తె కుడి కాలుమీద కాటు వేసింది.

ఆ మరుక్షణం రాకుమార్తె బంగారు నెమలిగా ఎగురుతూ కోట బయటికి వెళ్ళిపో యింది. ఇది చూసిన రాకుమారి చెలికత్తెలు హాహాకారాలు చేస్తూ, రాజు విచిత్రసేనుడికి చెప్పారు. ఆయన వెంటనే గుర్రం మీద నెమలిని వెంబడించాడు. అయితే, అది ఆయనకు చిక్కకుండా అరణ్యంలోకి ప్రవే శించి, చివరకు అవ్వ పూరి గుడిసెలో దూరింది.

రాజు పుట్టెడు దిగులుతో గుడిసెలో ప్రవే శించాడు. ఇప్పుడక్కడ ఆయనకు మూడు బంగారు నెమళ్ళు కనిపించాయి. ఆ మూడూ అచ్చు గుద్దినట్టు ఒక్క మాదిరిగానే వున్నాయి.

అవ్వ, మహారాజును చూసి, "ఏమి నాయనా మళ్ళీ వచ్చావు? నేనిచ్చిన గుడ్డు పగల్లేదా? ఇంకొక గుడ్డు కావాలా?" అన్నది ఏమీ ఎరగనిదానిలా.

రాజు ఆ మాటకు మండిపడుతూ, "ముసలి దానా, నంగనాచి కబుర్లాడావంటే, నరికి పోగులు పెడతాను, జాగ్రత్త! నా ఒక్కగానొక్క కూతురు బంగారు నెమలిగా మారి ఇక్కడి కొచ్చింది. మర్యాదగా నా కుమార్తెకు పూర్వ రూపం వచ్చేటట్లు చెయ్యి. లేకుంటే నీ ప్రాణాలు దక్కవు," అన్నాడు ఒరలోంచి కత్తిదూసి.

అవ్వ బోసి నోరు తెరిచి వికటంగా నవ్వి, "మహావీరుడివే కానీ, ముందు కత్తిని ఒరలో పెట్టు. ఈ మూడు నెమళ్ళలో ఏది నీ కూతురో గుర్తుపట్టు.సరిగ్గా గుర్తుపట్టితే బంగారునెమలి నీ కూతురుగా మారుతుంది. లేదంటే నువ్వు కూడా శాశ్వతంగా బంగారునెమలిగా మారి పోతావు," అని హెచ్చరించింది.

విచిత్రసేనుడు కత్తిని ఒరలో పెట్టి, నెమళ్ళ వైపు పరీక్షగా చూశాడు. అందులో ఒక నెమలి తల ఎత్తి అతడికేసి చూస్తున్నది.దాని కళ్ళల్లో

నీళ్ళు తిరగడం ఆయన గమనించాడు. మరొక నెమలి దీనంగా తల వంచుకుని వున్నది. దాని కళ్ళల్లోనూ నీళ్ళు తిరుగుతున్నవి.

రాజు కొంచెంసేపు ఆలోచించి అవ్వతో, "ఈ తల ఎత్తి నాకేసి ధీమాగా చూస్తున్నది, నా కుమార్తె దీప్తిరేఖ. తల వంచి దీనంగా నేల చూపులు చూస్తున్నది, కోయపెద్ద కుమార్తె మోహిని," అన్నాడు.

దానికి అవ్వ మెచ్చుకుంటున్నట్టు తలాడించి, "నాయనా, నీ కూతుర్ని బాగా గుర్తించావు. ఇప్పుడే ఆ బంగారునెమలిని, నీ కూతురుగా మార్చబోతున్నాను!" అని ఏదో మంత్రం జపిస్తూ నెమలికేసి వెళ్ళబోయింది.

అప్పుడు రాజు, "అవ్వా, ఆగు!" అంటూ ఆమెకు చేయి అడ్డుపెట్టి, "నువ్వు నా కుమార్తెనే కాదు, కోయపెద్ద కుమార్తెను కూడా మనిషిగా మర్చాలి," అన్నాడు.

అవ్వ రాజుకేసి ఆశ్చర్యంగా చూస్తూ, "నీకా కోయపెద్ద కూతురు ఊసెందుకు? నీ కూతుర్ని వెంటబెట్టుకుని వెళ్ళిపో," అన్నది.

విచిత్రసేనుడు అందుకు అంగీకరించక, "ఆ కోయపెద్ద నా రాజ్య పౌరుడు. నా కుమార్తె కన్న ముందుగా అతడి కుమార్తెను కాపాడడం రాజధర్మం. అలా కాదంటే – నన్ను కూడా బంగారునెమలిగా చెయ్యి!" అంటూ అవ్వ ముందు మోకరిల్లాడు.

అవ్వ వెంటనే రాజు భుజాల మీద చేతులు ఆనించి, "రాజా! నీ దయాగుణం, ధర్మబుద్ధీ నాకు చాలా ఆనందం కలిగిస్తున్నవి. నేనూ నీ రాజ్య పౌరురాలినన్న మాట గుర్తుంచుకో. అరణ్యంలో ఎవరికీ హాని చేయకుండా స్వేచ్ఛగా తిరిగే ప్రాణుల్ని – అవి ఎంతటి అపూర్వమైనవి అయినా, వాటిని పట్టిబంధించడం, చంపడం లాంటి క్రూర కార్యాలను నిషేధించు," అంటూ వెళ్ళి, రెండు బంగారు నెమళ్ళనూ రాకుమార్తెగా, కోయపెద్ద కుమార్తెగా మార్చింది.

విచిత్రసేనుడు, అవ్వకు కృతజ్ఞత చెప్పుకుని, కోయపెద్దకు అతడి కుమార్తెను అప్పగించి, రాకుమారి దీప్తిరేఖతో ఆనందంగా తన రాజధానికి వెళ్ళిపోయాడు.





# భట్రాజుల చమత్కారం

బావాజీపేట జమీందారుకు, ప్రతిరోజూ నిద్ర లేవగానే అలవాటుగా వినే వందిమాగధుల స్తోత్ర పాఠాలు విసుగు కలిగించాయి. ఆయన తన దివానును పిలిచి, "ఈ భట్రాజులు, విప్ర వినోదులు, గారడీ, నాటకాలు, తోలుబొమ్మలు ప్రదర్శించే వాళ్ళు, వట్టి సోమరిపోతులు. బద్ధకం కొద్దీ ఏ పనీ చెయ్యలేక, వినోదం కలిగిస్తున్నామంటూ సోమరిపోతుల సంఖ్య పెంచుతున్నారు. ఇకనుంచీ మాసికాలు, వార్షికాలు అంటూ వీళ్ళకోసం మనం డబ్బు ఖర్చు పెట్టనవసరం లేదు. బద్ధకం, సోమరితనం వదిలించుకుని, ఏదైనా పనిలో చేరి కష్టపడి సంపాదించుకోమన్నానని, నా ఉత్తర్వుగా అందరికీ తెలియజేయండి," అని చెప్పాడు.

దివాను చిన్నగా నవ్వి, "ప్రభూ! ఇష్టమున్నా, లేకపోయినా, పాలించే ప్రభువు క్షేమం కోరి నేను చెప్పే మాటలను కొట్టిపారేయకండి. వినోదం అన్నది జనజీవనంలో భాగం. మనకు నచ్చని రోజున కళాకారులను సోమరిపోతుల నడం మంచి పద్ధతి కాదు. దేశ సౌభాగ్యం కోసం మనిషి కష్టపడి పని చెయ్యడం ఎంత అవసరమో, మానసికోల్లాసానికి ఈ కళాకారులూ అంతే అవసరం. వాళ్ళకు మీరిచ్చే బహుమానాలనూ, వార్షికాలనూ గురించి మరొకసారి ఆలోచించండి," అన్నాడు వినయంగా.

జమీందారు విసుగుపడుతూ దివానుకేసి చూసి, "రాజ్యం వీరభోజ్యం అన్నారు. అందుచేత రాజ్య రక్షణకూ, అభివృద్ధికీ వీరులైన వాళ్ళను ప్రోత్సహించాలి. కష్టేఫలే అన్నారు. కష్టపడినప్పుడే ధనం సంపాయించగలం. అందుచేత కష్టపడి పనిచేసే వాళ్ళను ప్రోత్సహించి, జమీందారీ ఆర్థికపరిస్థితిని ఇనుమడింప చేయాలి. అంతేగాని, పొట్ట కోసం ఒళ్ళు గోకే వాళ్ళనూ, అలాంటి వాళ్ళకోసం మతిమాలిన పాటలూ, కీర్తనలూ రాసేవాళ్ళనూ నేను ప్రోత్సహించను. ఇది నా నిర్ణయం," అన్నాడు.

జె. ఉదయ నాగశిరీష

దివాను మరి మాట్లాడలేకపోయాడు. జమీందారుకళాకారులగురించిఅన్న మాటలు నలుగురికీ తెలిసిపోవడంతో, అందరూ కళాకారుల్ని సోమరిపోతుల్లా చూడసాగారు. దానితో బావాజీపేటజమీలో సంగీతం, నాట్యం కనుమరుగయ్యాయి. వాటికోసం కవిత్వం రాయబడినా, ఆదరించే వాళ్ళు లేక అటక లెక్కాయి. ఇక శిల్పం, చిత్రలేఖనం నామ మాత్రంగా మిగిలిపోయాయి. ఊరూరూ తిరిగి నాటకాలేసేవాళ్ళు, సరయిన రచనలు లేక ప్రజలను రంజింప చెయ్యలేకపోయారు.

ఇలా వుండగా — జమీందారిణికి పెద్ద జబ్బు చేసింది. ఇంచు మించు ప్రాణాపాయ స్థితి నుంచి బయటపడింది. ఆస్థానవైద్యుడు, జమీందారుతో, "ప్రభూ! రాణీ గారికి కష్ట పడి నా శక్తికొద్దీ వైద్యం చేశాను. ఇప్పుడామెలో జబ్బు లక్షణాలేం లేవు. ఆమెను అనుక్షణం కనిపెట్టుకుని వుండి ఉల్లాసం కలిగించగల వాళ్ళను ఏర్పాటు చేయండి. సంతోషం సగం బలం అన్నారు గదా! మానసికోల్లాసంతో, ఆమె త్వరగా మునుపటి మనిషి కాగలదు," అని చెప్పాడు.

ఇది విని ఆలోచిస్తున్న జమీందారుతో, సమయానికక్కడే వున్న దివాను, "ప్రభూ! కార్యభారంతో అలిసిపోయినా, మనసు ప్రశాం తంగా లేకపోయినా తమ పూర్వీకులు లలిత కళలతో కాసేపు పొద్దు పుచ్చేవారు. వాటిని మీరు కాదనుకున్నా, రాణీ గారి కోసమైనా



కొంతకాలం అనుమతించండి," అని కోరాడు. జమీందారు అందుకు సరేనన్నట్టు మౌనంగా తలూపాడు.

కొద్ది రోజుల్లోనే దివాణం కళాకారులతో కళకళలాడింది. మొదట నీరసంగా అనిపిం చినా, రెండు రోజులు గడిచేసరికి జమీందా రిణి కళా ప్రదర్శనలు చూడకుండా వుండలేని స్థితికి చేరుకున్నది. భార్యతో పాటు జమీం దారు కూడా ఆ ప్రదర్శనలు చూస్తూ, జీవి తంలో వినోదం కూడా ముఖ్యమే అనుకో సాగాడు.

మూడో రోజున జమీందారు భార్య ఉల్లా సంగా వున్నది. ఇంతలో అక్కడికి ఇద్దరు భట్రాజులు వచ్చారు. జమీందారు వాళ్ళను

చూసి ముఖం చిట్లించాడు. అయినా వాళ్ళు జమీందారును తమ పొగడ్తలతో ఆకాశానికెత్తే శారు. చివరగా ఒకడు, రెండవ వాడితో, "తండ్రీ కొడుకులిద్దరు, ఒకామెకు చెరొక పిల్లవాణ్ణీ ఇచ్చారు. ఆ పిల్లలిద్దరి మధ్యా యుద్ధం కల్పించి ఒకణ్ణి చంపి, రెండో వాడికి రాజ్యం కట్టబెట్టిన భగవంతుడికి, ఒక ఆవు పాలతో అభిషేకం చేయించమని జమీందారు గారికి చెప్పరా, బావా!" అన్నాడు.

"ఏ ఆవురా బావా?" అని అడిగాడు రెండోవాడు.

ఇది విన్న జమీందారుకు చిర్రెత్తుకొచ్చింది. "ఛీ! ఈ అసందర్భ ప్రలాపుల్ని ఇక్కణ్ణించి తరిమెయ్యండి. అర్థం పర్థం లేని మాటలూ వీళ్ళూనూ," అన్నాడు దివానుతో.

అప్పుడు దివాను వినయంగా జమీందారుతో, "ఇవి అర్థం పర్థం లేని మాటలు గావు, ప్రభూ! వాళ్ళు, శ్రీకృష్ణుడికి క్షీరాభిషేకం చేయించమని చెబుతున్నారు. సూర్యుడు, యముడు తండ్రి కొడుకులవుతారు. వాళ్ళు కుంతీదేవికి కర్ణుణ్ణి, ధర్మరాజునూ వరపుత్రులుగా ప్రసాదించారు. కురుక్షేత్ర యుద్ధంలో కృష్ణుడు, ధర్మరాజుకు సహాయం చేసి కర్ణుణ్ణి చంపించాడు. ఆ కృష్ణుడికి ఆవుపాలతో అభిషేకం చేయించమని కోరుతున్నారు వాళ్ళు. అంతే కాదు—'ఏ ఆవురాబావా?' అన్న వాక్యం లోఐదు భాషలున్నాయి. ఏ అంటే మరాటీ. ఆవు అంటే హిందీ. రా అంటే తెలుగు. బా అంటే కన్నడం. వా అంటే అరవం. ఈ పదాలన్నిటికీ ఆయా భాషలలో అర్థం, రమ్ము," అంటూ వివరించాడు.

ఆ వివరణ విన్న జమీందారు సంతోషంగా, "ముఖే ముఖే సరస్వతి! ఏదో పొగడ్త అనుకునే దానిలో కూడా, చమత్కారం చేయగల శక్తి ఒక్క భాషకే వుంది. ప్రతి విద్యలోనూ పరమార్థమే కాకుండా సాహితీ సరస్వతి వుంటుందనీ, ఆ చమత్కారం హృదయానికి ఆనందం కలిగిస్తుందనీ తెలుసుకున్నాను!" అని, ఆ భట్రాజులనే కాకుండా కళాకారులందరినీ ఘనంగా సన్మానించాడు.

ఆ తర్వాత బావాజీపేట జమీలో కళలకు ప్రోత్సాహం మళ్ళీ లభించింది.






"అర్జునుడితో ద్వంద్వయుద్ధం చెయ్యాలంటే నువ్వు కూడా రాజువై వుండాలి," అని కృపాచార్యులు అనటమూ, కర్ణుడు తన తల్లిదండ్రుల పేర్లు చెప్పటానికి బిడియపడటమూ గమనించి దుర్యోధనుడు కృపాచార్యులతో ఇలా అన్నాడు:

"సుక్షత్రియ వంశంలో పుట్టినవారినీ, మహాశూరులనూ, పెద్ద సేనలు గలవారినీ రాజులనవచ్చునని శాస్త్రాలు చెబుతున్నాయి. అయినా కర్ణుడు అర్జునుడితో ద్వంద్వయుద్ధం చెయ్యటానికి అతడు రాజు కాదన్నదే అభ్యంతరమైతే అతన్ని ఈ క్షణాన్నే అంగరాజ్యానికి రాజుగా అభిషేకిస్తాను."

దుర్యోధనుడు ఆజ్ఞాపించగా మంత్రవేత్తలైన పురోహితులు వచ్చారు. బంగారు సింహాసనం వచ్చింది. బంగారు కలశాలతో నీరు వచ్చింది. పుష్పాక్షతలు వచ్చాయి. దుర్యోధనుడు కర్ణుణ్ణి సింహాసనంలో కూర్చోబెట్టి, రాజుగా అభిషేకించాడు.

ఈ కర్మకాండ ముగియగానే కర్ణుడు దుర్యోధనుడితో, "మహారాజా, నేను నీనుంచి రాజ్యదానం పొందినందుకు ప్రత్యుపకారం ఏమి చెయ్యను?" అన్నాడు.

"నీవంటి పరాక్రమశాలి మైత్రి నాకు కావాలి," అన్నాడు దుర్యోధనుడు.

ఇదంతా చూస్తున్న కర్ణుడి పెంపుడు తండ్రి సూతుడు తాను తోలే రథం మీది నుంచి దిగివచ్చి, అంగరాజైన కర్ణుణ్ణి అభినందించాడు. కర్ణుడు సూతుడికి పుత్ర భావంతో నమస్కరించాడు. సూతుడు కర్ణుణ్ణి ఆప్యా

9. అంగ రాజ్యాభిషేకం



యంగా లేవనెత్తి కౌగిలించుకున్నాడు. ఇద్దరూ ఆనంద బాష్పాలు రాల్చారు.

కర్ణుడు సూతుడి కొడుకన్నది బయట పడిపోయింది. భీముడు కర్ణుడితో, "సూత పుత్రా, రథాలు తోలుకోక అర్జునుడితో ద్వంద్వ యుద్ధం చేస్తానంటావా? ఇదేమైనా బాగుందా? నీకీ అంగరాజ్య సింహాసనం మటుకు దేనికి?" అన్నాడు.

కర్ణుడికి మండిపోయింది. కాని ఏమీ అనలేక, కోపంగా బుసలు కొడుతూ ఆకా శంలో సూర్యుడికేసి చూస్తూ మౌనంగా ఉండి పోయాడు.

తమ్ముల మధ్య కూర్చుని వున్న దుర్యో ధనుడు భీముడితో, "భీమసేనా, నీ మాటలు ఉచితంగా లేవు. రాజైనవాడు బలంగల ప్రతి వాడితోనూ యుద్ధం చెయ్యటానికి సిద్ధంగా ఉండాలి. అర్జునుడైనా అంతే. శూరుల పుటకా, ఏరుల పుటకా ఎవరూ చెప్పలేరు. దివ్యలక్షణాలూ, సహజ కవచకుండలాలూ గల ఈ కర్ణుడు సాధారణ జన్ముడు కాడు. అతడు ఒక్క అంగరాజ్యాన్నే కాదు, భూమి నంతా ఏలదగినంతటి పరాక్రమవంతుడు. నేనితనికి చేసిన అంగరాజ్యాభిషేకం ఎవరి కైనా సమ్మతం కాకపోతే వాళ్ళు నాతో ద్వంద్వ యుద్ధం చేసి జయాపజయాలు తేల్చుకో వచ్చు," అన్నాడు.

ఈ మాటకు ప్రేక్షకులందరూ హాహాకారాలు చేశారు.

ఇంతకూ ఏ ద్వంద్వయుద్ధం గాని జరిగే లోపలనే సూర్యడస్తమించాడు. కొందరు అర్జు నుణ్ణీ, కొందరు కర్ణుణ్ణీ, కొందరు దుర్యోధ నుణ్ణీ మెచ్చుకుంటూ అందరూ తమతమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. దుర్యోధనుడికి మాత్రం ఆ రోజు పర్వదినం. ఈనాటిదాకా అతనికి అర్జునుడు పక్కలోబల్లెంలాగుండి బాధిస్తూ వచ్చాడు. ఈ రోజు నుంచీ దుర్యోధనుడికి అర్జునుడి భయం పోయింది. అతను గుండె మీద చెయ్యి వేసుకుని నిశ్చింతగా నిద్రపో యాడు.

కొంతకాలం గడిచింది. ఒకనాటి ఉదయం ద్రోణుడు తన శిష్యులందరినీ రమ్మని పిలి పించి, "నాకు గురుదక్షిణ ఇవ్వండి," అని

అడిగాడు. అందరూ ఆయనకు నమస్కారాలు చేసి, "ఏమిటి తమ ఉత్తరువు?" అని అడిగారు.

"ఐశ్వర్యమదంతో కొట్టుకుంటున్న అవివేకి ద్రుపదుడు. అతన్ని పట్టి తీసుకు రండి," అన్నాడు ద్రోణుడు.

గురువుగారి ఆజ్ఞ నిర్వర్తించటానికి కుమారులందరూ సిద్ధపడి, రథాలు సిద్ధం చేశారు; కవచాలు ధరించారు; ఖడ్గాలనూ, విల్లంబులనూ తీసుకున్నారు; ద్రుపదుడి పైకి యుద్ధానికి పోవటానికి సర్వ సన్నాహాలు పూర్తిచేసి, అందరూ ద్రోణుడి వెంట బయలుదేరారు.

పాంచాలపురం కనుచూపు మేరలో ఉన్నదనగా అర్జునుడు ద్రోణుడితో, "వీరిలో ఒక్కరు కూడా ద్రుపదుణ్ణి తీసుకురాలేరు. వీరు విఫలులై తిరిగి వచ్చేదాకా మా పాండవులం ఇక్కడే ఉండి, ఆ తరవాత ద్రుపదుణ్ణి పట్టి తెస్తాం," అన్నాడు.

దుర్యోధనుడి ముఠా కర్ణుణ్ణి వెంటబెట్టుకుని రాచనగరు ప్రవేశించి, ద్రుపదుణ్ణి పట్టుకుంటామని వీరాలాపాలాడుకుంటూ రాజమార్గాన వస్తున్న సంగతి ద్రుపదుడికి తెలిసింది. ఆయన వెంటనే తన సేనలనూ, తమ్ములనూ వెంటబెట్టుకుని వాళ్ళతో యుద్ధానికి వచ్చాడు. కౌరవులూ, వారూ కొంతసేపు దర్పంగానే పోట్లాడారు గాని, ద్రుపదుడి ధాటికీ, ద్రుపదుడి సేనల విజృంభణకూ తట్టుకోలేక, చావుతప్పి కన్ను లొట్టపోయిన విధంగా అయి, యుద్ధరంగం వదిలి పాండవులున్న చోటికి పారిపోయి వచ్చారు.





అప్పుడర్జునుడు ద్రోణుడికి ప్రణామం చేసి, ధర్మరాజు అనుమతి పొంది, భీముణ్ణి తన సేనకు నాయకుడుగానూ, నకుల సహదేవులను తన రథానికి చక్రరక్షకులుగానూ పెట్టుకుని, ద్రుపదుణ్ణి పట్టి తెస్తానని బయలుదేరాడు.

భీమార్జునులు ద్రుపదుడి సేనమీద పడి అల్లకల్లోలం చేసేశారు. అర్జునుడు భయంకరంగా యుద్ధం చేస్తూ తన రథాన్ని ద్రుపదుడి రథం ఉన్నవేపు పోనిచ్చాడు. ద్రుపదుడు రోషంతో అర్జునుడి మీద దారుణమైన దాడి చేశాడు. ఒక దశలో ద్రుపదుడు కనబడక ఆయన సైన్యం హాహాకారాలు చేసింది. అర్జునుడు ద్రుపదుడి రథాన్నీ, అశ్వాలనూ ధ్వంసం చేసి, కత్తి దూసి ద్రుపదుడి రథం కాడిపైకి దూకి ద్రుపదుణ్ణి పట్టుకున్నాడు.

ఈ లోపల భీమ నకుల సహదేవులు పారిపోయే ద్రుపదుడి సేనలను ఊచకోత కొయ్యటం అతని కంటపడింది. అర్జునుడు గట్టిగా కేక వేసి, "ద్రుపదుడు చిక్కాడు. మనం వచ్చిన పని పూర్తి అయింది. ఈయన మనకు బంధువు. అనవసరంగా ద్రుపదుడి సేనను హతమార్చకండి," అని వారిని హెచ్చరించాడు.

తరవాత అర్జునుడు ద్రుపదుణ్ణి కట్టి తీసుకువచ్చి ద్రోణుడికి గురుదక్షిణగా సమర్పించాడు. ద్రోణుడు ద్రుపదుణ్ణి చూసి, "పాంచాల రాజా, ఇప్పుడు నీ కాంపిల్య నగరంమాకు చిక్కింది, ఇప్పటికైనా నన్ను నీ బాల్య స్నేహితుడిగా గుర్తిస్తావా? భయపడకు. నేను బ్రాహ్మణ్ణి. పరమ శాంత మూర్తిని. మన బాల్యస్నేహాన్ని నేను మరువలేదు. నీ స్నేహం కోసమే నిన్ను తెప్పించాను. నాకు రాజ్యాలు ఏలేవాళ్ళ స్నేహమంటే చాలా ఇష్టం. కాని ఇప్పుడు నీకు రాజ్యం లేదు. నీ స్నేహం కోసమై అర్ధరాజ్యం ఇస్తాను తీసుకో. గంగకు దక్షిణంగా ఉండేదంతా నీ రాజ్యం. ఉత్తరంగా ఉండేది నా రాజ్యం. ఇద్దరమూ హాయిగా రాజ్యాలు ఏలుకుందాం," అన్నాడు.

ద్రుపదుడు ద్రోణుడితో శాశ్వత మైత్రికి ఒప్పుకున్నాడు. ద్రోణుడాయన కట్లు విప్పించి, వెళ్ళిపోనిచ్చాడు.

అదిమొదలు ద్రుపదుడు దక్షిణ పాంచాలానికి మాత్రమే రాజుగా ఉంటూ వచ్చాడు. మాకందీ, కాంపిల్య నగరాలు ఆయన రాజధానులు. సైనిక బలంతో ద్రోణుణ్ణి సాధించటం తనకు అసాధ్యమని ద్రుపదుడు గ్రహించాడు. అదీగాక ఆయనకు అంతవరకూ సంతాన కాంక్ష తీరలేదు. ఈ రెండు కారణాల చేతా ఆయన తరచూ దేశసంచారం చేస్తూ, గొప్ప తపస్సు చేసిన మునులను ఆశ్రయించసాగాడు.

అహిచ్ఛత్రం రాజధానిగా చేసుకుని గంగకు ఉత్తరంగా ఉన్న ఉత్తర పాంచాలాన్ని ద్రోణుడు పాలించాడు.

ఒక సంవత్సరం గడిచింది. ధృతరాష్ట్రుడు ధర్మరాజును యువరాజుగా అభిషేకించ నిశ్చయించాడు. ధర్మరాజు ధైర్యమూ, ఓర్పు గలవాడు; వక్ర స్వభావుడు కాడు; భృత్యులను ఆదరిస్తాడు.

యువరాజుగా ధర్మరాజు రాజ్యపాలనలో సమర్థుడనిపించుకున్నాడు. అతను పాండురాజు కన్నా కూడా మేటి అని అందరూ మెచ్చుకున్నారు.

భీముడు బలరాముడికి శిష్యుడై గదాయుద్ధంలోనూ, ఖడ్గయుద్ధంలోనూ నైపుణ్యం సంపాదించాడు.

అర్జునుడు విల్లును దృఢంగా పట్టుకుని, ఆ చేతికి ఎంత దెబ్బ తగిలినా సరే విల్లు వదలకుండా ఉండటం అభ్యాసం చేశాడు. ద్రోణుడికి నచ్చిన అంశాలలో ఒకటి ఏమంటే అర్జునుడు అతి వేగంగానూ, అత్యంత లాఘ





వంగానూ బాణాలు వేయగలడు. అన్నిరకాల ఆయుధ ప్రయోగాలలోనూ మంచి చాతుర్యం గలవాడు.

"ఎంతటివాళ్ళు నీతో యుద్ధానికి వచ్చినా సరే వారిపట్ల గౌరవంకొద్దీ మానవద్దు; యుద్ధం విధిగా చెయ్యి," అని ద్రోణుడు అర్జునుడికి సలహా ఇచ్చాడు.

అర్జునుడు ద్రోణుడి అభిమానానికి పాత్రుడై, కౌరవ రాజ్యానికి శత్రువులుగా ఉండి తన తండ్రికి కూడా లొంగని సౌవీర రాజు విమలుడనేవాణ్ణీ, దత్తామిత్రుడనే వాణ్ణీ, అతడి తమ్ముణ్ణీ చంపాడు. తాను ఒక్కడే రథం మీద బయలుదేరి వెళ్ళి, తూర్పు దేశపు రాజులను పదివేల మందిని ఒక్కసారే జయించాడు; ఇంకా అనేకమంది పరిసర రాజులను ఓడించి కౌరవ రాజ్యానికి సామంతులుగా చేసి, వారి నుంచి కప్పాలు గానూ, కానుకలు గానూ అంతులేని ధనరాసులను సంపాదించి, వాటిని తమ రాజధాని హస్తినాపురానికి చేర్చాడు.

నకుల సహదేవులు కూడా కౌరవ రాజ్యానికి శత్రువులైన రాజులను అనేక మందిని జయించి, అంతులేని ధనాన్ని తెచ్చి బొక్కసం నింపారు.

పాండవుల ఖ్యాతి ఈ రూపంగా నాలుగు దిక్కులా వ్యాపించటం చూసి ధృతరాష్ట్రుడు సహించలేకపోయాడు. ఓర్వలేని తనంతో దహించుకుపోయాడు. వారిని అలాగే పైకి రానివ్వటమూ, లేక నిగ్రహించటమూ అన్నది తేల్చుకోలేక, కణికుడనే ముసలి బ్రాహ్మణ మంత్రిని సలహా అడిగాడు. శత్రువైన వాణ్ణి ఏ మాయోపాయం చేత నిర్మూలించినా తప్పు లేదన్నాడు కణికుడు.

ధృతరాష్ట్రుడిలాగే దుర్యోధనుడు కూడా అసూయ చెంది తన మిత్రులయిన కర్ణ, శకుని, దుశ్శాసనులతో ఆలోచించాడు. పాండవులను నిర్మూలించాలన్న నిశ్చయానికి వచ్చి, తండ్రితో చెబితే, తండ్రి పరమానందంతో అలాగే చెయ్యమన్నాడు.

పాండవులను వారణావత పురానికి (కాశీకి) పంపి, అక్కడ లక్క ఇంట దహించటానికి పథకం తయారయింది.

ధృతరాష్ట్రుడి ఆజ్ఞను అనుసరించి ఆయన మంత్రులు ఒకరొకరే పాండవుల వద్దకు వచ్చి వారణావతపురం ఎంత అందంగా ఉంటుందో వర్ణించసాగారు; ఆ నగరాన్ని ఒక్కసారి చూడమని పాండవులను ప్రోత్సహించారు.

తరవాత ధృతరాష్ట్రుడే పాండవులను పిలిపించి, "నాయనలారా, వారణావతపురం చూడటానికి వెయ్యి కళ్ళు చాలవని అందరూ అంటున్నారు. త్వరలో అక్కడ శివుడికి ఉత్సవం కూడా జరగబోతున్నది. కావాలంటే, మీరు మీ అమ్మను వెంటబెట్టుకుని అక్కడికి వెళ్ళి, కొంత కాలం అక్కడ సరదాగా గడిపి, ఆ తరవాత హస్తినాపురానికి తిరిగి రండి," అని అన్నాడు.

ఇది దేశ బహిష్కరణ అని ధర్మరాజు గ్రహించి, ధృతరాష్ట్రుడి మాటలకు పెద్దగా ఆనందం ప్రదర్శించలేదు.

ఈలోగా దుర్యోధనుడు పురోచనుడనే శిల్పిని ఏకాంతంగా తీసుకుపోయి అతనితో ఇలా అన్నాడు :

"మా తండ్రి పాండవులను వారణావత పురానికి పంపేస్తున్నాడు. నువ్వు ముందుగానే రథం మీద అక్కడికి వెళ్ళి, లక్క మొదలుగా గల వస్తువులతో, తగలబెడితే దివిటీలాగా మండే ఇంటిని అందంగా తయారు చెయ్యి. అందులో సామగ్రి అంతా ఏర్పాటుచేసి, చూసినవాళ్ళు ఎంతో బాగున్నదనేటట్టుగా చూడు. పాండువులా ఇంట ఏ అనుమానమూ లేకుండా కొన్నాళ్ళున్న తరవాత, అర్ధరాత్రి వేళ వారు గాఢ నిద్రలో ఉన్న సమయంలో ఇంటికి నిప్పు పెట్టి వచ్చెయ్యి. వాళ్ళందులో కాలి చచ్చిపోతే నేను అటుపైన నిశ్చింతగా ఉంటాను. నేను తరవాత ఈ సువిశాలమైన రాజ్యానికి రాజునై నీకు ఎంత ఉపకారం చేస్తానో చూసుకో."

ఇందుకు పురోచనుడు సమ్మతించాడు. అతనికోసం వేగవంతమైన గుర్రాలను పూన్చిన రథం సిద్ధం చేయించి, దానిమీద అతన్ని వారణావతపురానికి పంపేశాడు. పురోచనుడు అక్కడికి చేరుతూనే శ్రద్ధగా తన పనిలో నిమగ్నుడయ్యాడు.



# గోపన్న అనుమానం

గోపన్నకు మతిభ్రమించింది. పట్నం తీసుకువెళ్ళి వైద్యుడికప్పగించారతణ్ణి. కొద్ది నెలలపాటు వైద్యం చేశాక వైద్యుడు, గోపన్న మతి బాగయిందని చెప్పి ఇంటికి వెళ్ళమన్నాడు.

గోపన్న తన ఊరుకు తిరిగి వస్తున్నాడు. ఊరి పొలిమేరలో పెద్ద చింతచెట్టు కింద కూర్చుని, తనవంక వింతగా చూస్తున్న ఒక వ్యక్తిని గమనించాడు గోపన్న. అతణ్ణి అంతకు ముందు ఎక్కడో చూసినట్లని పించింది గోపన్నకు.

గోపన్న అతణ్ణి సమీపించి, "అయ్యా, తమర్ని ఇదివరకు ఎక్కడో చూసినట్టుంది. బహుశా పోయిన సంవత్సరం నరసాపురంలో శేషయ్య గారి అబ్బాయి పెళ్ళిలో చూసి వుంటాను. అవునా?" అని అడిగాడు.

కాదన్నాడా వ్యక్తి గోపన్న వంక కోపంగా చూస్తూ.

"మరయితే, రామాపురం పశువుల సంతలో కలిసి వుంటాం మనం. అవునా?"అని అడిగాడు గోపన్న.

కానే కాదన్నాడా వ్యక్తి మరింత కోపంగా.

"అయితే, తప్పకుండా మనం పెద్దినాయుడుగారి షష్ఠిపూర్తి మహోత్సవంలో తారసపడి వుంటాం. అవునా?" అని అడిగాడు గోపన్న.

ఆ వ్యక్తి మండిపడుతూ, "చాలు, నోర్మూయ్యి వెధవా! నేను నీ మేనమామ కొడుకు చలమయ్యనురా," అనిగోపన్నను తిరిగి పట్నం తీసుకుపోయి వైద్యుడికిఅప్పగించాడు. - కోనే నాగవెంకట ఆంజనేయులు



# చందమామ అనుబంధం – 76

# మనదేశపు చెట్లు



## వేపచెట్టు

ఒక ఆవిడ వైద్యుడి దగ్గరికి వెళ్ళి, తన భర్త దూర ప్రాంతానికి వెళుతున్నాడనీ, అది తనకు ఇష్టంలేదనీ అయన త్వరగా తిరిగి వచ్చే ఉపాయం చెప్పమనీ అడిగిందట. వైద్యుడు, అతన్ని వెళ్ళేప్పుడు చింతచెట్టు కింద విశ్రాంతి తీసుకుంటూ వెళ్ళి, తిరుగు ప్రయాణంలో వేపచెట్టు కింద విశ్రాంతి తీసుకుంటూ రమ్మని చెప్పాడట. భార్య మాట ప్రకారం భర్త అలాగే చింత చెట్టు కింద విశ్రాంతి తీసుకుంటూ వెళుతూ, మార్గమధ్యంలోనే అనారోగ్యానికిలోనై, వెనుదిరిగి, తిరుగుప్రయాణంలో వేపచెట్టు కింద విశ్రాంతి తీసుకుంటూ ఇల్లు చేరేసరికి పూర్తిగా కోలుకుని ఆరోగ్యవంతుడయ్యాడట. వేపచెట్టు ఔషధగుణాన్ని తెలియచేసే పాత కథ ఇది. అంటే, చింతచెట్టు నీడ,గాలి అనారోగ్యాన్నీ, వేపచెట్టు నీడ, గాలి ఆరోగ్యాన్నీ కలుగజేస్తాయన్న మాట!

వేపకు చాలా ఔషధగుణాలున్నాయి. ముఖ్యంగా ఇది క్రిమిసంహారకగుణం కలది. సబ్బుల తయారీలోనూ, టూత్ పేస్టులలోనూ వేపనూనె వాడతారు. ఉదయం లేవగానే వేప పుల్లతో పళ్ళు తోముకునే అలవాటు ఇంకా పల్లెటూళ్ళలో ఉన్నది. వేపచెట్టు గాలి చాలా మంచిది. అందుకే మశూచి సోకినప్పుడు ఇంటి ముందు వేపాకు కట్టేవాళ్ళు. ఉగాది రోజున వేప పువ్వు తింటే ఆరోగ్యానికి మంచిదనే నమ్మకమూ ఉన్నది. వేపచెట్టు నుంచి కారే జిగురు ఆకలి పుట్టిస్తుంది. వేప కలప చాలా దృఢమైనది. చేదుగా ఉండడంవల్ల దీనిని, చీమలు, చెదలు, పురుగులు ముట్టుకోవు. వేప కలపను ఓడల నిర్మాణంలో ఎక్కువగా ఉపయోగిస్తారు.

వేపచెట్టు ఎత్తుగా పెరుగుతుంది. నాలుగు వైపులకూ కొమ్మలు ఉంటాయి. చిన్న చిన్న దళసరి ఆకులు మొనదేలి ఉంటాయి. యేడాది పొడవునా చిగురించినప్పటికీ మార్చ్ – ఏప్రిల్ నెలలలో ఆకులు గుబురుగా వుంటాయి. అప్పుడే పూతకు వస్తాయి. చిన్న చిన్న తెల్లటి పువ్వులు తేనె వాసన వేస్తాయి. సంవత్సరంలో రెండుసార్లు పూతకు వస్తాయి. చిన్న పళ్ళు, తొక్క తీసి నోట్లో వేసుకున్నప్పుడు తియ్యగా ఉంటాయి.

వేపను హిందీలో నీమ్ అనీ, బెంగాలీలో నీమ్‌గాచ్ అనీ, కన్నడంలో బేవూ అనీ, తమిళంలో వేంబు అనీ, మలయాళంలో వేప అనీ, మరాఠీలో నీమ్‌బాయ్ అనీ, ఇంగ్లీష్‌లో మార్గోసా అనీ అంటారు.



# కాళిదాసు

మహాకవి కాళిదాసును గురించీ, ఆయనను పోషించిన విక్రమాదిత్యుణ్ణి గురించీ తెలియని వారు ఎవరు? మనం నెలనెలా చదివే బేతాళ కథలకూ, విక్రమార్కుడికీ సంబంధం ఉన్న సంగతి కూడా తెలిసినదే!

ప్రాచీన భారతీయ సాహిత్యంలో మహాకవి కాళిదాసు రచించిన కావ్యాలకూ, నాటకాలకూ ఉన్న మహోన్నత స్థానం గురించి భిన్నాభిప్రాయాలు లేవు. కాని ఆయన జీవితకాలం గురించి మాత్రం పండితులు ఏకాభిప్రాయానికి రాలేకపోతున్నారు. కాళిదాసు క్రీ.పూ.8వ శతాబ్దానికి చెందినవాడని కొందరంటే, క్రీ.పూ. 2వ శతాబ్దానికి చెందినవాడని మరి కొందరు అభిప్రాయపడుతున్నారు. కాదు, ఆయన క్రీ.శ. 4వ శతాబ్దానికి చెందినవాడని వాదించేవారూ ఉన్నారు.

మనదేశ చరిత్రలో విక్రమాదిత్య నామంతో పలువురు రాజులు ఉన్నారు. వారిలో ఇద్దరు సుప్రసిద్ధులు. విక్రమ శకాన్ని ప్రవేశ పెట్టిన రాజు మొదటి విక్రమాదిత్యుడు. ఆయన క్రీ.పూ.1వ శతాబ్దానికి చెందినవాడు. రెండవ రాజు రెండవ చంద్రగుప్తుడు. ఆయన పాలన 4-5 శతాబ్దాల మధ్య సాగింది. ఈ విక్రమాదిత్యుడి ఆస్థానకవి కాళిదాసు అని పలువురు చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు. కాని దీనికి కూడా చాలినన్ని ఆధారాలు లేవు. విక్రమాదిత్యుడి ఆస్థానంలో కాళిదాసుతో పాటు 'నవరత్నా'లని పేరుగాంచిన తొమ్మిది మంది పండితులు ఉండేవారు. వారు: కాళిదాసు, ధన్వంతరి, క్షపణకుడు, అమరసింహుడు, శంకు, బేతాళభట్టు, ఘటకర్పరుడు, వరాహమిహిరుడు, వరరుచి. ఈ 'నవరత్నాలు' రెండవ చంద్రగుప్తుడి ఆస్థానంలో ఉండేవారనడానికి తగిన ఆధారాలు లేవు. కాబట్టి 'నవరత్నాలు' అంతకు పూర్వం విక్రమాదిత్యుడి ఆస్థానంలో ఉండే వారని భావించవచ్చు.

ఏది ఏమైనా కాళిదాసు ఉజ్జయినీ నగరవాసి అన్న విషయంలో సందేహం లేదు. పురాతన భారతదేశంలో ప్రసిద్ధిగాంచిన నగరాలలో ముఖ్యమైనది ఉజ్జయిని.

కాళిదాసుకు సంబంధించిన ఒక విచిత్ర గాథ కూడా ప్రచారంలో ఉన్నది:

యువకుడైన కాళిదాసు, పొట్టపొడిచినా

అక్షరంముక్క రాని అమాయకుడు. కొందరు పండితులు, విద్యాగర్వంతో తమను అవమాన పరిచిన ఒక యువరాణిపై పగసాధించడానికి పథకం వేశారు. ఏమాత్రం విద్యాగంధం లేని అమాయకుడైన కాళిదాసును తీసుకువచ్చి, పండితుడని యువరాణిని మభ్యపెట్టి ఆమెతో వివాహం జరిపించారు. అయితే, త్వరలోనే యువరాణికి పండితులు చేసిన మోసం తెలిసిపోయింది. ఆమె పట్టరాని ఆగ్రహంతో భర్తను బయటకు గెంటేసింది. కాళికాదేవి భక్తుడయిన కాళిదాసు బాధతో దేవీ ఆలయానికి వెళ్ళి, తాను ఈ అవమానాన్ని భరించలేననీ, తక్షణమే ప్రాణత్యాగం చేస్తాననీ దేవీ విగ్రహం ముందున్న శూలాన్ని అందుకోబోయాడు. ఆ క్షణమే కాళికాదేవి ప్రత్యక్షమై అతనికి మహాకవి కమ్మని వరమిచ్చి, ఆశీర్వదించింది. అక్షరం ముక్క రాని అమాయకుడైన యువకుడు కాళికాదేవి కరుణతో ప్రపంచంకీర్తించే మహాకవి కాళిదాసుగా మారిపోయాడు!

కాళిదాసు-రఘువంశం, కుమారసంభవం అనే రెండు కావ్యాలు; విక్రమోర్వశీయం, మాళవికాగ్నిమిత్రం, అభిజ్ఞాన శాకుంతలం లనే మూడు నాటకాలు; మేఘదూతం, ఋతుసంహారం అనే మరి రెండు కావ్యాలు రచించాడు.

సంస్కృత సాహిత్యం మీదే కాకుండా, వివిధ భాషలలో వెలువడిన భారతీయ సాహిత్యంమీద కాళిదాసు ప్రభావం ఇంతింతని చెప్పనలవికానిది.



# మీకు తెలుసా?

1. మనదేశంలో తయారయిన అంతరిక్ష రాకెట్ పేరేమిటి? దానిని ఎప్పుడు, ఎక్కడి నుంచి ప్రయోగించారు?
2. పాములలో ఎన్ని రకాలున్నాయో తెలుసా?
3. గుజరాత్‌లోని పోర్‌బందర్ ఎందుకు ప్రసిద్ధిగాంచింది?
4. మొట్టమొదటి బ్రిటిష్ ప్రధాన మంత్రి ఎవరు?
5. మనదేశంలో పొడవైన ఆలయ మంటపం ఎక్కడ ఉన్నది?
6. టెలిస్కోపును కనుగొన్న వారెవరు? ఎప్పుడు కనుగొన్నారు?
7. వృక్షశాస్త్ర పరిశోధనకు వీలుగా మనదేశాన్ని ఎనిమిది ప్రాంతాలుగా విభజించారు. అవి ఏవో మీకు తెలుసా?
8. 'మెర్డేకా కప్' ఏ క్రీడకు బహూకరిస్తారు?
9. మనదేశంలో ప్రథమ 'పంచవర్ష ప్రణాళిక'ను ఎప్పుడు ప్రారంభించారు?
10. మనదేశంలో నిర్మించిన మొట్టమొదటి 3-డి చిత్రం ఏది? ఎప్పుడు నిర్మించారు?
11. భారత స్వాతంత్ర్యం కోసం కృషి చేసిన ఐరిష్ వనిత ఎవరు?
12. మనదేశంలో 'ఎయిర్ మెయిల్' ఎప్పుడు ఆరంభమయింది?
13. 'ఫ్లయింగ్ శిఖ్' అని పేరొందిన వారెవరు?
14. లోక్‌సభ మొట్టమొదటి స్పీకర్ ఎవరు?
15. 'బ్రహ్మసమాజం' సంస్థాపకుడు ఎవరు?
16. సజీవ అగ్నిపర్వతాలలోకెల్లా చాలా ఎత్తయినదేది?
17. మనదేశంలో సుప్రసిద్ధ 'ఓషన్ టు స్కై' సాహసోపేత పర్వతారోహణకు నాయకత్వం వహించిన వారెవ్వరు?
18. ఆకులలో ఆహారాన్ని భద్రపరచే మొక్క ఏది?

## సమాధానాలు

1. రోహిణి. తిరువనంతపురం సమీపంలోని తుంబా నుంచి. 1967 నవంబర్ 20.
2. 2,000 రకాలకు పైగా.
3. మహాత్మాగాంధీ జన్మస్థలం.
4. సర్ రాబర్ట్ వాల్‌పోల్.
5. రామేశ్వరం.
6. నెదర్లాండ్‌కు చెందిన హాన్స్ లిప్పర్‌షే. 1608 అక్టోబర్ 2.
7. దక్కన్,మలబార్,సింధుమైదానం,గంగా మైదానం, అస్సాం, తూర్పు హిమాలయాలు, పశ్చిమ హిమాలయాలు,అండమాన్స్.
8. ఫుట్‌బాల్.
9. 1951లో.
10. 'మైడియర్ కుట్టిచ్చాత్తాన్' (మలయాళం). 1984లో.
11. అనీబెసెంట్.
12. 1911లో.
13. క్రీడాకారుడు మిల్ఖాసింగ్. 1960వ సం॥ రోమ్ ఒలింపిక్స్‌లో 400 మీటర్స్ పరుగు పందెంలో నాలుగవస్థానంలో వచ్చాడు.
14. జి.వి. మావ్‌లాంకర్. 1952 నుంచి 1960 వరకు.
15. రాజా రాంమోహన్‌రాయ్.
16. అర్జెంటీనాలోని అంటోఫాలా. 6,450 మీ॥ ఎత్తు.
17. సర్ ఎడ్మండ్ హిల్లరీ.
18. క్యాబేజీ.



# అక్కరకు రాని స్నేహం

ప్రతాపుడనే వాడికి పన్నెండేళ్ళ వయసు. ఇంట్లో తల్లిదండ్రులకు అన్ని పనుల్లోనూ సాయపడుతూంటాడు. ఇరుగు పొరుగులు కూడా ఏదో అవసరం అయినప్పుడు అడిగితే, చిన్నా పెద్ద పనులు చేసి పెడుతూండేవాడు. ఎంతో మంచివాడని అందరికీ వాడంటే ఇష్టం. వాడికి మాత్రం నరేంద్రుడనే తన ఈడు కుర్రవాడంటే ఇష్టం.

నరేంద్రుడు, ప్రతాపుడికి పొరుగునే వుంటున్నాడు. వాడు భాగ్యవంతుల బిడ్డ. వాడికి ఏ పనీ వుండదు. తన తీరిక సమయంలో కొంత ప్రతాపుడితోనే గడుపుతూంటాడు. అయితే తను ప్రతాపుడి ఇంటికి వెళతాడే తప్ప, ప్రతాపుణ్ణి తన ఇంటికి రమ్మని ఎప్పుడూ అనడు.

ఒకరోజు సాయంత్రం గ్రామంలోని యువకులు కొందరు, ఊరి బయట మైదానంలో చెడుగుడు ఆడుకుంటున్నారు. కొంతసేపటికి అలసిపోయి అందరూ కూర్చుని కబుర్లు చెప్పుకోసాగారు. ఆ సమయంలో అక్కడికి పొరుగూరి తినుబండారాల వ్యాపారి వచ్చాడు.

వాడు కొత్తరకం తినుబండారం ఒకటి తయారుచేసి తెచ్చాడు. అది చాలా అద్భుతంగా వుందని అంతా కొనుక్కుని తిన్నారు. ప్రతాపుడు కొనుక్కున్నాడు కానీ నరేంద్రుడు కొనుక్కోలేదు. "ఏం, డబ్బు తెచ్చుకోలేదా?" అన్నాడు ప్రతాపుడు జాలిగా.

"ఎప్పుడేం అవసరమొస్తుందో అని నా దగ్గర డబ్బు లెప్పుడూ వుంచుకుంటాను. కానీ బయట అమ్మే తినుబండారాలు కొనుక్కోవద్దని అమ్మ చెప్పింది," అన్నాడు నరేంద్రుడు బుద్ధిగా.

"నువ్వు కొనుక్కున్నట్టు ఇంట్లో వాళ్ళకేం తెలుస్తుంది? హాయిగా నువ్వూ మాతోపాటు కొనుక్కునితిను," అన్నాడు ప్రతాపుడు.

"నాదగ్గర ఎంత డబ్బుందో అమ్మకు ఖచ్చితంగా తెలుసు. ఇంటికి వెళ్ళగానే చూసి,

జొన్నలగడ్డ రామలక్ష్మి



తక్కువైతే ఏం చేశావని అడుగుతుంది మరి," అన్నాడు నరేంద్రుడు బాధగా ముఖం పెట్టి.

"ఆఁ, ఇంతేగా! ఏ బిచ్చగాడికో దానం చేశానను. లేదా దారిలో ఎక్కడో పోయిందను. నువ్వింకా చిన్నపిల్లవాడివి కాదు. నీవాళ్ళు నీ మాట నమ్మరా?" అని అడిగాడు ప్రతాపుడు ఆశ్చర్యంగా.

దీనికి నరేంద్రుడు కాసేపు తలాడిస్తూ వూరుకుని, "నమ్ముతారనుకో. కానీ అబద్ధం చెప్పడం పాపమని నాకు బామ్మ చెప్పింది. బామ్మ మాటలు నేను నమ్ముతాను," అన్నాడు.

"అయ్యో! నాదగ్గర డబ్బులున్నాయి. కావాలంటే నేను నీకిది కొనిపెట్టగలను. కానీ మీ అమ్మ నిన్ను తినవద్దన్నది," అని నొచ్చుకున్నాడు ప్రతాపుడు.

"నువ్వు కొంటే తింటాను, ఎందుకంటే-నాదగ్గర డబ్బులు తగ్గవు కాబట్టి. ఇంట్లో ఎవరికీ తెలియదు. డబ్బు లెక్క సరిపోతే అమ్మ నన్నింకేం అనదు. అడక్కపోతే నేనూ అబద్ధం చెప్పక్కర్లేదు గదా!" అన్నాడు నరేంద్రుడు తెలివిగా.

ప్రతాపుడు, నరేంద్రుడికి తినుబండారం కొనిపెట్టాడు. వాడది తిని ఎంతో మెచ్చుకుని, "నీమూలంగా నాకిది రుచి చూసే అదృష్టం కలిగింది. కానీ ఈ విషయం నువ్వు మీ అమ్మకు్కూడా చెప్పకు; మా అమ్మకు చెబుతుందేమో!" అన్నాడు.

సరేనన్నాడు ప్రతాపుడు. ఒకరోజున పొరుగింటివాళ్ళు బయటకు వెళుతూ ప్రతాపుణ్ణి పిలిచి, "నాయనా! ఇంట్లో నరేంద్రుడొక్కడే వున్నాడు. మేమంతా రెండు గంటల్లో తిరిగి వస్తాం. అంతవరకూ నువ్వు వాడికి తోడుగా ఉండు," అని చెప్పారు.

అంతవరకూ ప్రతాపుడు, నరేంద్రుడి ఇంటి లోపలి భాగం చూడలేదు. అందువల్ల వాడు చాలా కుతూహలపడ్డాడు.

నరేంద్రుడి ఇల్లు ఎంతో వైభవంగా వుంది. ఆ ఇంట్లో ప్రతాపుడికి తెలియని సదుపాయాలెన్నో వున్నాయి. నరేంద్రుడికైతే ప్రత్యేకంగా ఒక గది వుంది. ఆ గదిలో అద్దాల బీరువా నిండా రకరకాల బొమ్మలు, ఆట వస్తువులు



వున్నాయి. మరొక బీరువా నిండా చాలా పుస్తకాలున్నాయి.

"ఇవన్నీ వుండడం వల్ల ఇంట్లో ఒక్కణ్ణే వున్నా నాకు మంచి కాలక్షేపం. కానీ నాకు నువ్వుంటేనే ఎక్కువ కాలక్షేపమవుతుంది," అన్నాడు నరేంద్రుడు.

ఆ మాటలకు సంతోషించిన ప్రతాపుడు, "బీరువాల్లో వున్న ఆట వస్తువులూ, పుస్తకాలూ ఏవేమిటో ఒకసారి పరీక్షగా చూస్తాను," అంటూ వాటికేసి వెళ్ళబోయాడు.

అయితే నరేంద్రుడు వాణ్ణి అడ్డుకుని, ఒక వస్తువుగానీ, పుస్తకంగానీ ముట్టుకోనివ్వ లేదు. బయటివాళ్ళు ముట్టుకుంటే అవన్నీ పాడైపోతాయని పెద్దవాళ్ళు వాడికి చెప్పారట!

"మరి నువ్వు మా ఇంటికొచ్చి అన్నీ ముట్టుకుంటావు గదా," అన్నాడు ప్రతాపుడు ఆశ్చర్యంగా.

"మీ పెద్దవాళ్ళు వద్దనలేదుగా మరి!" అన్నాడు నరేంద్రుడు.

ఆతర్వాత ఇద్దరూ కూర్చుని ఏవేవో కథలు చెప్పుకున్నారు కానీ, ప్రతాపుడికి మనసులో ఏదో వెలితిగా అనిపించింది.

మరొకరోజున కుర్రవాళ్ళు కొందరు ఊరి బయట చెరువుగట్టున కూర్చుని వుండగా, ఒకతను పిల్లనగ్రోవులు తెచ్చాడు. ఆ పిల్లనగ్రోవుల్లో దేన్ని ఎవరు ఊదినా మధురంగా పలుకుతుంది. తెచ్చినవాడు ఒక్కొక్కటి రెండు రూపాయలకు అమ్మాడు. నరేంద్రుడు కూడా ఒక పిల్లనగ్రోవి కొనుక్కున్నాడు. ప్రతాపుడి వద్ద ఒక రూపాయి మాత్రమే వుంది. అందు వల్ల వాడు, నరేంద్రుణ్ణి ఒక రూపాయి అప్పివ్వమని అడిగాడు.

"స్నేహితులకెన్నడూ అప్పివ్వద్దని తాతయ్య చెప్పాడు. అప్పిస్తే స్నేహం చెడిపోతుందిట!" అన్నాడు నరేంద్రుడు వెంటనే.

ప్రతాపుడికి చాలా కోపం వచ్చింది. అప్పటికి అయిదారు సార్లయినా తను వాడికి తినుబండారాలు కొనిపెట్టి వుంటాడు. లెక్క చూసుకుంటే, ఒక ఏడాదిలో తను వాడికోసం ఖర్చు పెట్టింది ఇరవై రూపాయలకు తక్కువ వుండదు. ఇప్పుడు రూపాయి అడిగితే అప్పుగా కూడా ఇవ్వనంటున్నాడు. అన్నీ తన నుంచి



తీసుకుంటూ, తనకేమీ ఇవ్వని స్నేహితుడు వాడు!

"అప్పిస్తే స్నేహం చెడిపోతుందన్నావుగా, గుర్తుంచుకో. ఇప్పుడు అప్పివ్వనందువల్ల మన స్నేహం చెడిపోతుంది. ఈ పిల్లనగ్రోవి నేను కొనుక్కోలేకపోయానో — మనమిక స్నేహితులం కాదు," అన్నాడు ప్రతాపుడు ఉక్రోషంగా.

"అలా అనకురా — నీ స్నేహం లేకుండా నేనుండలేను," అన్నాడే తప్ప, నరేంద్రుడు వాడికి అప్పిస్తాననలేదు.

అంతలో రామేశం అనే కుర్రవాడొకడు తనే ఒక పిల్లనగ్రోవిని కొని ప్రతాపుడికిచ్చి, "నువ్వు నాకు చాలాసార్లు సాయపడ్డావు. ఇలాంటివెన్ని కొనిస్తే నీ ఋణం తీరుతుం దిరా!" అన్నాడు.

ప్రతాపుడెంతో సంతోషించి, "నీ ఋణం అలాగే వుంచుకో. ఇప్పుడొక రూపాయి ఇస్తాను. ఇంకొక రూపాయి బాకీ రేపు తీర్చేస్తాను," అంటూ బలవంతంగా వాడికి రూపాయి ఇచ్చి, "చూశావా, స్నేహితుడంటే అలా వుండాలి!" అన్నాడు నరేంద్రుడితో.

నరేంద్రుడు ఒక్క క్షణం ముఖం చిన్న బుచ్చుకుని, మరుక్షణం సంతోషంగా, "ఈ రోజు నుంచీ రామేశం కూడా నాకు స్నేహి తుడు. ఎందువల్లనంటే — వాడి కారణంగా నువ్వు పిల్లనగ్రోవి కొనుక్కున్నావు. ఆవిధంగా వాడు మన స్నేహం నిలబెట్టాడు. పిల్లనగ్రోవి కొనుక్కోకపోతే, మనం స్నేహితులం కాదని నువ్వన్నప్పటి నుంచీ నేను చాలా బెంగపెట్టు కున్నాను. రామేశం నా బెంగ పోగొట్టాడు," అన్నాడు.

ఆరోజు నుంచి ప్రతాపుడు, నరేంద్రుడికి దూరంగా వుండసాగాడు. నరేంద్రుడెంత ప్రయత్నించినా వాడు మట్లాడకుండా ముఖా వంగా వుండసాగాడు. ఇది పనికాదని నరేం ద్రుడు, ప్రతాపుడి తాతకు తన బాధ చెప్పు కున్నాడు. ప్రతాపుడి తాత, నరేంద్రుణ్ణిపం పేసి ప్రతాపుణ్ణి పిలిచి, సంగతి అడిగి తెలుసుకుని, "ఇంతకాలంగా నువ్వు నరేంద్రు డికి మంచి స్నేహితుడివనుకున్నాను. ఉత్త స్వార్థపరుడివి!" అన్నాడు.

"స్వార్థం నాదా, వాడిదా?" అన్నాడు ప్రతాపుడు ఆశ్చర్యంగా.

"నరేంద్రుడు నీ స్నేహితుడు. అవసరంలో వాడికి నువ్వు సాయపడ్డావు. అది నీ మంచితనం. అందుకు ప్రతిఫలాన్నాశించడం స్వార్థం. ఇంత చిన్న వయసులో స్వార్థముండడం మంచిది కాదు," అన్నాడు ప్రతాపుడి తాత.

"మరి నా అవసరంలో వాడు నాకు సాయపడవద్దా?" అని అడిగాడు ప్రతాపుడు కోపంగా.

"వాడికిష్టమైతే సాయపడతాడు, లేకుంటే లేదు. స్నేహం కేవలం డబ్బో, మరేదైనా వస్తువో ఇచ్చి పుచ్చుకునేందుకు కాదు. ఒకరి ఆలోచనలొకరు పంచుకుని మనసులు వికసింప జేసుకునేందుకే మనిషి స్నేహం చెయ్యాలి. ఇచ్చి పుచ్చుకోవడం వ్యాపార లక్షణం," అన్నాడు ప్రతాపుడి తాత.

ఈ జవాబు బాగున్నట్టు తోచినా ఇంకా అనుమానం పోక ప్రతాపుడు, "అయితే ఇందులో నరేంద్రుడి తప్పేం లేదా?" అని ప్రశ్నించాడు.

"తప్పు నీదే కానీ వాడిది కాదు. ఎందుకంటే – నువ్వేం చేసినా నరేంద్రుడి సంతోషం కోసం చేశావు. మరి తను సంతోషించని పనిచేయమని వాడినడగడం నీ తప్పు కాదా?" అన్నాడు ప్రతాపుడి తాత.

"అంతా బాగానే వుంది కానీ తాతా! అక్కరకు రాని ఇలాంటి స్నేహంవల్ల నాకేమైనా ప్రయోజనముందంటావా?" అన్నాడు ప్రతాపుడు.

"ఎందుకు లేదు? ప్రతిఫలమాశించని స్నేహాన్ని వాడు నీకు నేర్పుతున్నాడు. నీ నుంచి ఏమీ నేర్చుకోకపోతే, అప్పుడు నరేంద్రుడికే నీది అక్కరకు రాని స్నేహమవుతుంది!" అన్నాడు ప్రతాపుడి తాత.

ప్రతాపుడికి తాత సందేశం అర్థమయింది. అప్పటి నుంచీ వాడు ప్రతిఫలం రాలేదన్న కారణంగా ఎవరితోనూ స్నేహాన్ని మానుకోలేదు. అయితే తాత వాడికేం చెప్పాడో తెలుసుకున్నాక నరేంద్రుడు కూడా తన ప్రవర్తనకు సిగ్గుపడి క్రమంగా ఉపకారపరుడిగా మారి, తనూ ప్రతాపుడి స్నేహం వల్ల మంచి ప్రయోజనం పొందాడు.





# ఆస్తి పంపకం

కొండవీటికి దగ్గర గల ఒక గ్రామంలో ఒక భూస్వామి ఉండేవాడు. ఆ భూస్వామి చుట్టు పక్కల గల తొమ్మిది గ్రామాలకు న్యాయాధి కారి, సంపన్నుడు. ఆయనకు నలుగురు కుమారులు. వారిలో పెద్దవాడు పెత్తందారుగా ఉండేవాడు. రెండోవాడు పశుపోషణా, మూడో వాడు వ్యవసాయమూ చూసుకునేవారు. నాలుగోవాడికి విద్యలో, దైవకార్యాలు ధర్మ కార్యాలు చేయటంలో ఆసక్తి హెచ్చు.

కొంతకాలం జరిగాక భూస్వామి వృద్ధుడై మంచాన పడ్డాడు. ఆయన కుమారులను పిలిపించి, "నాయనలారా! ఇంతకాలమూ మనం ఒకరి తగాదాలు తీర్చాము గాని మన తగాదాలను ఎప్పుడూ ఇతరుల దగ్గరికి తీసుకు పోలేదు. నాకు కాలం సమీపించింది. మీరు ఇప్పుడు నా మంచంకోళ్ళ దగ్గర మీ ఇష్టాను సారం నిలబడండి. నేను పోయాక ఎవరి కోటివద్ద వారు తవ్వుకోండి. ఆస్తుల విషయంలో మీలో మీరు తగాదాలు మాత్రం పడవద్దు," అన్నాడు.

కుమారులు నలుగురూ నాలుగు కోళ్లవద్దా నిలబడ్డారు.

"నే చేయగలది ఇంకేమైనా ఉందా?" అని తండ్రి అడిగాడు.

మరేమీ లేదని కుమారులు చెప్పినమీదట "నారాయణ, నారాయణ," అంటూ భూస్వామి నిశ్చింతగా ప్రాణం విడిచాడు.

తండ్రికి దినవారాలుచేసిన అనంతరం నలుగురు అన్నదమ్ములూ నాలుగు గునపాలు తెచ్చి, తండ్రి చెప్పిన ప్రకారం ఎవరి కోటి వద్ద వారు తవ్వుకున్నారు.

పెద్దవాడు తవ్వినచోట ఊక వచ్చింది. రెండోవాడు తవ్వినచోట పేడ వచ్చింది. మూడోవాడు తవ్వినచోట మట్టితప్ప మరేమీ రాలేదు. నాలుగోవాడు తవ్వినచోట మాత్రం వెండి బంగారాలుదొరికాయి. ఇదిచూసి మిగి

లిన ముగ్గురన్నలకూ అమితమైన కోపం వచ్చింది.

"చూశారా? ఆఖరివాడన్న అభిమానం కొద్దీ ఎందుకూ పనికిరాని తమ్ముడికి వెండి బంగారాలిచ్చి మనకు ఊకా, పేడా, మట్టి చూపించాడు మన తండ్రి," అనుకున్నారు పెద్దవాళ్ళు.

"ఎవరి ఇష్టంవచ్చిన కోటిదగ్గిర వాళ్ళు నిలబడ్డారు. మీరంతా నిలబడిన తరవాత మిగిలిన కోటిదగ్గరే నేను నిలబడ్డాను. ఇందులో నా తప్పేమీ లేదు. నా అదృష్టం ఇలా ఉంది, మీ అదృష్టం అలా ఉంది. దానికి ఎవరేం చేస్తారు?" అన్నాడు ఆఖరు వాడు శాంతంగా.

"అదంతా కుదరదు. మనం ఈ విషయం కొండవీటి న్యాయస్థానంలో పరిష్కారం చేసుకోవలసిందే,"అన్నారు ముగ్గురు అన్నలు పట్టరాని కోపంతో.

వారు తండ్రి ఆఖరి కోరికను తృణీకరించి, కొండవీటికి వెళ్ళి తమ తగాదాను రచ్చకెక్కించారు.

న్యాయాధికారి వారు చెప్పినదంతా విని, కొంతసేపు మౌనంగాఆలోచించి,"మీతండ్రికి గలఆస్తి ఏమిటి?వివరంగా చెప్పండి," అని అడిగాడు.

"మా తండ్రి గారికి పొలాలూ, పశువులూ, ధాన్యపు వ్యాపారమూ, వెండిబంగారాలు ఉన్నాయి," అని భూస్వామి కొడుకులు బదులు చెప్పారు.

"వాటినే న్యాయాధికారి అయిన మీ తండ్రి మీకు పంచాడు. ధాన్యపు వ్యాపారం పెద్దవాడిది. పశుసంపద రెండోవాడిది. పొలాలు మూడోవాడివి. వెండిబంగారాలు నాలుగోవాడివి. వాటిని పంచుకుని సుఖంగా ఉండండి,"అని తీర్పుచెప్పాడున్యాయాధికారి.

ఆ తీర్పు ముగ్గురన్నలకూ ఎంతో ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలిగించింది. తమ తండ్రి ఆఖరివాడి మీద ప్రత్యేకంగా చూపిన అభిమానం ఏమీలేదనీ, తండ్రి చేసిన అన్యాయంఏదీ లేదనీ తెలుసుకుని, నలుగురూ తమ గ్రామానికివెళ్ళి ఐకమత్యంగా జీవించసాగారు.



Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!





It's time to go back to school again. Time for text books. Time for games. Time to meet old friends. And make new ones. Time to start studying again. Because there's so much to learn about the world around you.

From all of us here at Chandamama, have a great year in school. And remember to tel what you've learnt everyday, when yo come home from school !

THE

HANDAMAMA

OLLECTION

# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1995 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.



Devidas Kasbekar



B.V. Ravichandran

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * ఫిబ్రవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మిగిలింది అనుభవసారం! రెండవ ఫోటో : ముందుంది జీవనసమరం!!

పంపినవారు : బి.వి.ఆర్.ఎస్.ఎస్.ఎస్. ప్రసాద్, ఫ్లాట్ నెం 111, క్రెసెంట్ టవర్స్ (ఈనాడు ఎదుట) సీతమ్మధార, విశాఖపట్నం – 530 013. (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 60.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి :

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి !

**సంవత్సర చందా :**

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా : రూ. 117.00 ఎయిర్‌మెయిల్ ద్వారా : రూ. 264.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా : రూ. 123.00 ఎయిర్ మెయిల్ ద్వారా : 264.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి :

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026

# 10 తేడాలు చెప్పండి






జవాబులు :

1. పువ్వులో రేకులు ఎక్కువ ఉన్నాయి.
2. చిలక నోరు తెరుచుకుని ఉంది.
3. చిలక మెడ చుట్టూ ఎర్రటి పట్టీ ఉంది.
4. అమ్మాయి కళ్లు తెరిచి ఉన్నాయి.
5. అమ్మాయి నవ్వుతూ ఉంది.
6. ఫ్రాక్ పైన నక్షత్రాలు ముద్రించి ఉన్నాయి.
7. అమ్మాయి గాజు వజ్రాలతో పొదిగి ఉంది.
8. కుక్క నాలుక బయటకు వేలాడుతోంది.
9. ప్లేట్ మీద పార్లే యొక్క పేరు వ్రాయబడి ఉంది.
10. ప్లేటులో మేంగో బైట్లు ఉంచబడ్డాయి.